విలాలగోపాలకృష్ణయ్యగారి రచన



## మద్రాసు

# ంత్రివర్గమా ఎక్కడికి?



అ. 2

శక్తి ప్రచురణాలయం, బెజవాడ

# మద్రాసు మంత్రివర్గమా ఎక్కడికి?

"ప్రజల ఆదాయాన్ని పెంపొందించి, అందుమూలంగా పన్ను చెల్లించగల శక్తిని వృద్ధిపరచే ఆర్థికాభివృద్ధి ప్రణాళికలకు ప్రాధాన్యం యిస్తామంటూ" మన మద్రాసు ప్రభుత్వం పంచ వర్ష ప్రణాళికల మొత్తాలను 135 కోట్ల నుండి 80 కోట్ల రూపాయలకు తగ్గిస్తూ, నవంబరు 13న ప్రకటించింది.

మద్రాసులో కాంగ్రెస్ మంత్రివర్గం వచ్చిన తర్వాత ఈ మాటలు అమలులో జరుపుటకు ఇంతవరకేమైనా ప్రయత్నించిందేమో-యోచించుదాం.

ప్రజలకు కావలసింది కూడు, గుడ్డ, ఇళ్లు, వగైరాలు, ప్రభుత్వపు అంచనాలనుబట్టి చూచినా, అధిక ఆహారోత్పత్తికై ఇంతవరకు చేసిన కృషి కాన్పించదు. ఇంకా బియ్యం రేషనింగు తగ్గించవలసి వస్తుందని, సర్ది వాడుకోనండని రాజేంద్రప్రసాద్ మద్రాసు ప్రజలను వింతగా ప్రబోధించుచున్నాడు. రాష్ట్రంలో సరిపోయేపంటయేపండింది - ధాన్యసేకరణ జయప్రదంగా సాగింది. ధాన్యపు లోటుండదని ప్రధాని ప్రకాశంగారు అంటున్నారు. అన్ని జిల్లాల నుండి వారాలతరబడి రేషన్ డిపోలలో ధాన్యం లభించడంలేదని ప్రజలు గొల్లున గోలపెట్టుతున్నారు.

పరాయి రాజ్యాల నుండి, భారతదేశంలోని ఇతర రాష్ట్రాల నుండి, అధికధరలు చెల్లించి ధాన్యంరేషనుడిపోలకందించితే, వాటిని వ్యాపారులు ఆహారకమిటీలు బ్లాక్ మార్కెట్ చేస్తున్నారు. రాష్ట్రంలో పంటను, బోనసు చెల్లించి వసూలు చేస్తున్నాం అంటున్నారు. వ్యాపారులకు బోనసులు చేరుతున్నవి. పైపెచ్చు ఈ బోనసులవల్ల ప్రజల ఆదాయ

IPLA115B110



పెరుగజాలదు. మొత్తం మీద అదిభారంకూడా అవుతుంది. ప్రజలకు తిండిలభించదు. పన్నుచెల్లించే శక్తి వృద్ధి పొందబోవదు.

మద్రాసు ప్రభుత్వం అంచనాల ప్రకారం ఆంధ్రజిల్లాల్లో

| జిల్లాలు | ఎకరాలు |
|---|---|
| విశాఖ | 550300 |
| తూ. గో. | 150300 |
| ప. గో. | 380012 |
| కృష్ణా | 242 87 |
| గుంటూరు | 436545 |
| కర్నూలు | 270184 |
| బళ్ళారి | 302907 |
| అనంతపురం | 524632 |
| కడప | 289024 |
| నెల్లూరు | 781464 |
| చిత్తూరు | 411945 |

సాగుకులాయకయిన బంజర్లున్నవి. తిండిలేక, చేయుటకు పనిలేక భూమిలభిస్తే సాగుచేసుకొని బ్రతుకుటకు, ఉత్సాహంగా అధికాహారోత్పత్తి సాగించుటకు, నోట్లముమ్మరం పెరిగినా 1939 లో నూటికి అదనంగా నూరువంతుల వంతున ఋణభారం పెరిగికృషించిపోతున్న వ్యవసాయకూలీలు, నూటికి 40 వంతున అప్పులుపెరిగి అవస్థపడుతున్న పేద రైతాంగం, కవులుదార్లు, గంపెడాసతో అర్రులుచాచి ఎదురుచూస్తున్నారు.

ఈపైబంజర్లు, సాగుకయివ్వండి చేస్తాంఅంటే-ఇదివరకు సాగుచేసింది ఈమధ్యసాగుచేసింది. లేదా-అంటే-ఇదిగో సాగుఅయింది అంటూ సాగుకులాయకు అయిన 50 ఎకరాల ప్లాటుల విస్తీర్ణపు లెక్కలు అగస్టు 2 న(1946) ప్రకటించినవి గమనించదగును.

| జిల్లా | ఉన్నపొలం | సాగైంది | 1354ఫసలీ పోరంబోకుసాగు |
|---|---|---|---|
| విశాఖ. | 7493 | 6330 | 2516 |
| తూ. గో. | 20975 | 3030 | 2862 |
| ప. గో. | 48914 | 8517 | 5712 |
| కృష్ణా | 9776 | — (?) | 8956 |
| గుంటూరు | 7636 | 139 | 26432 |
| నెల్లూరు | 68728 | 31672 | 41165 |
| కడప | 17929 | 664 | 41165 |
| అనంతపురం | 35201 | — | 14557 |
| బళ్ళారి | 74307 | 2004 | 12650 |
| కర్నూలు | 25492 | 18702 | 10842 |
| చిత్తూరు | 28602 | — | 2657 |

ఈ విధంగా 50 ఎకరాల లాట్లుగా గల భూమిని సాగుచేసుకోవడానికి, ఇపుడు చేసుకుంటున్న వారికే ఇస్తారా అంటే, వీలులేదని అనేక రూల్సులున్నవని, అవి ప్రతిబంధకం కల్పిస్తవనీ చెప్పారు. పోనీ పోరంబోకులు 1354 ఫసలీలో సాగయినంతవరకైనా, ఆసాగుచేసేవారికే సాగుకు యిస్తారా అంటే అదీ అసంభవమని అన్నారు. మరొక ప్రక్క సమ్మెలలో ప్రజాఉద్యమాలలో పాల్గొనమని ప్రభుత్వానికి హామీయిస్తామని అంటున్న, తిరిగివచ్చిన సిపాయీలకు ఇదివరకు వ్యవసాయకూలీలు, బీదరైతాంగం చేసుకుంటున్న భూములను సాగుకు యిస్తున్నారు. ఈ విధంగా గ్రామాల్లో తగాదాలు పెరిగిపోవుటకు అవకాశాలేర్పడుతున్నాయి.

వ్యవసాయ జీవనంమీద ఆధారపడినవారికి జీవనం పెరగడంతోపాటు ఆదాయం, అందువలన ప్రభుత్వపుఆదాయం పెరిగే అవకాశం కన్పించడం లేదు. వ్యవసాయ ఆదాయాలపై వేల కొలది, వందల కొలది ఎకరాలుచేసే భూస్వాములమీద పన్నువేస్తారాఅంటే అన్నీ మినహాయింపుల

తోటి అధ్వయిజర్లు తయారు చేసిన శాసనాన్ని అమలులోకి తీసుకురాబో తున్నాం అంటున్నారు.

ఆహార పంటలు అధికంచేసే అవకాశంలేదు. రాష్ట్రేతర ప్రాంతాల నుండి తెప్పించిన ధాన్యానికి ఖర్చులు వగైరాలటుండ, ధరల తేడాలో 10,80,000 (?) వరకు రాష్ట్ర ఖజానానుండి చెల్లించడం, రాష్ట్రప్రజలమీద భారంపడడం కన్పించుచున్నది.

'పాడిపంటలు' పత్రికలోను, కేంద్ర ప్రభుత్వం 'న్యూట్రిషన్'లోను బలవత్తరమగు ఆహారం తినవలెనని, ఉష్ణమాపక శక్తి ఉన్నతం కావాలెనని పుష్టికర ఆహారం తినవలెనని ప్రతి మనిషి ఇంత ధాన్యం, పండ్లు, నూనె, కాయలు, పప్పులు తినవలెనని ప్రచారం చేస్తున్నారు. దీనికై ఉద్యోగస్థులు, వారిసిబ్బందీలు, పెరిగిపోతున్నవి. తిండి గింజలు అదనంగా కాదుగదా, అసలే కాన్పించడం లేదు.

ఇక గుడ్డ సంగతి. విన్నగాక మొన్ననే వ్యక్తికి యిచ్చేగుడ్డను తలకు 5 గజాల గుడ్డకు తగ్గించుతూ ప్రకటించారు. ఇప్పటికే గుడ్డ లేక మధ్యతరగతి జనం, రైతాంగం, బీదజనం, అదీ యిదీ ఏమిటి ? అన్ని రకాల జనం నానా బాధలు పడుతున్నారు.

మరొకవంక ఆంధ్ర రైతాంగం, పండించిన పత్తి పంటే తక్కువ అయిపోతుండగా, దానిని కూడ కొనే ఆధారం లేకుండా పోతున్నది. క్రిందటి సంవత్సరం ఈ విధంగా పత్తి సాగు అయింది. అందులో పత్తి ఉత్పత్తి యీవిధంగావుంది.

| జిల్లా | పైశాల్యం | ఉత్పత్తి బేళ్ళు. |
|---|---|---|
| విశాఖ | 6099 | 830 |
| తూ. గో. | 4751 | 890 |
| ప. గో. | 257 | 50 |
| కృష్ణ | 22750 | 420 |
| గుంటూరు | 47601 | 8930 |

| | | |
|---|---|---|
| కర్నూలు | 119015 | 14140 |
| బళ్ళారి | 405914 | 48200 |
| అనంతపురం | 128135 | 14420 |
| కడప | 43486 | 5160 |
| నెల్లూరు | 30709 | 5180 |

ఇంత ప్రత్తి పండించినా అదికూడా అమ్ముడుపోయే అవకాశం లేదు. పండిన పత్తి అమ్ముడు పోకపోతే రైతు ఆదాయం యేంపెరుగు తుంది? రైతు ఆదాయం పెరగకపోతే, అధికంగా పన్ను లభించడంకాదు గదా, అసలు ప్రభుత్వానికేమీ పన్నే చెల్లించలేడు?

ఇంత పత్తి పండించి అమ్ముడు పోవటంలేదని, గుడ్డలేదని రైతాంగం అలమటిస్తుంటే, గుడ్డనేసి ప్రజావసరాలను తీర్చే చేనేత కార్మికులు తమకునూలులభించక, నెలలోవారానికి సరిపోయేనూలుకూడా లభించుట లేదేయని మగ్గాలు ముందువేసుకొని లెక్కలు చూచుకుంటు న్నారు. పత్తి పండించిన రైతు తన ధరలు లెక్కలు వేసుకుంటున్నాడు. ప్రభుత్వం సీలింగు, ఫ్లోరింగు ధరలు నిర్ణయించాంగదా, మీకు యింకేం కావాలంటూ ధరలు నిర్ణయించింది. కానిఆధరకు కొనేవారేరీ? ప్రభుత్వం కొంటుందా అంటే అదీలేదు. ఇతరుల చేత ఈధరలకు కొనిపించుతుందా అంటే అదియింతవరకు జరుగలేదు. ఇతర దేశాలకుపోయే పత్తిపై ఈ మధ్యనే కేంద్రప్రభుత్వం ఆర్డినెన్సుద్వారా బేలుకు రు 20 లు పన్నునిర్ణ యించింది. ఈజిప్టు, సింధు పత్తిమీదఉన్న మోజు బొంబాయి మిల్లుయజ మానులకు ఆంధ్రదేశంలోని పత్తిమీదలేదు. పోనీ, పరాయి రాష్ట్రం కొననే కొనదు; మీరైనా కొని మాపత్తిని దూదిచేసి గుడ్డ నేసి మాకివ్వండయ్యా అని అప్పుడు ప్రజలకుగుడ్డ, మా పత్తి ధరా, ప్రభుత్వానికి ఆదాయం, వస్తుందనీ రైతుఅంటున్నాడు. ఆంధ్రభూమిలోని చేనేతమగ్గాలవారు, మా మగ్గాలకు తగిన నూలు లభించడంలేదు, మామగ్గాలు, వాటికిసప్లయి అవుతున్న నూలుబేళ్ళను చూడండి అంటారు.

మగ్గాలు-నూలు

| జిల్లా | మగ్గాలు | బేళ్ళు |
|---|---|---|
| విశాఖపట్టణం | 27367 | 1278 |
| తూ. గోదావరి | 18900 | 806 |
| ప. గోదావరి | 7709 | 314 |
| కృష్ణా | 7821 | 305 |
| గుంటూరు | 22447 | 986 |
| నెల్లూరు | 13051 | 598 |
| చిత్తూరు | 15935 | 577 |
| కడప | 19936 | 730 |
| అనంతపురం | 10525 | 531 |
| కర్నూలు | 8767 | 542 |
| బళ్ళారి | 14079 | 770 |
| ఆంధ్ర | 166728 | 7468 |
| చెన్నరాజధాని | 495943 | 21305 |

తమకు ఇంకా నూలుయిప్పిస్తే తాము సరియగు ధరలకు గుడ్డను యివ్వడమేకాకుండా తమజీవనంకూడా సుఖంగాగడుపుకొవిన వారమవుతా మంటున్నారు చేనేత పారిశ్రామికులు. మిల్లులలో వచ్చే ఈనూలు చాలదు. అధికోత్పత్తి చేయవలెనంటే చెన్నరాజధానిలో కోయంబత్తూరు, మధుర మిల్లులలో ఉత్పత్తి చేసినాచాలడంలేదు. మిల్లుల్లోనూలు అక్కడి దక్కడే బ్లాకుమార్కెట్టులలోకి షాహుకార్లు నెట్టివేస్తున్నారు. వారివిషట్టి శిక్షించమంటే వారికి కాంగ్రెస్ మంత్రివర్గం ప్రజాపరిషత్తు సభ్యత్వం యిచ్చింది. అధికంగానన్నా ఉత్పత్తి చేస్తేగాని తప్పదని అధ్వాన్నపు అడ్వయిజర్ల పాలనలో కేంద్రప్రభుత్వం అనుమతివికూడా సంపాదించి

తీరాబట్టల మిల్లులు పెట్టబోతే, ఆంధ్రదేశానికి క్రొత్తగా మిల్లులు స్థాపించడానికి వచ్చిన ఈమిల్లుల అనుమతిని నిరాకరించారు.

| మిల్లు | మరకదుళ్ళు |
|---|---|
| రాయలసీమ వీవర్సు | 12000 |
| కర్నాటక మిల్సు బళ్ళారి | 17000 |
| కమలాపురం మిల్సు కడప | 12000 |
| అనంతపురం మిల్సు అనంతపురం | 7700 |
| తుంగభద్ర మిల్సు, కర్నూలు | 12000 |
| రామభద్ర టెక్స్టైల్స్ (తూ.గో) | 18000 |
| కృష్ణా టెక్స్టైల్స్ (కృష్ణా) | 12000 |
| హేమలత టెక్స్టైల్స్ గుంటూరు | 12000 |
| కదిరిమిల్సు | 12100 |
| | 1139000 |

వీటితోబాటు రాజధాని మొత్తానికి వచ్చిన 352000 మరకదుళ్ళు ఖద్దరుఉత్పత్తికి అటంకం కల్పించినవి కావున త్రిప్పివేస్తున్నామని కేంద్ర ప్రభుత్వానికి వ్రాసారు. ఇప్పుడున్న నూలుమిల్లుల ఉత్పత్తిచాలదు. గుడ్డ లేదు. అదవంగా నూలుసప్లయిచేసే ఆశలేదు. ఇకపోతే ఖద్దరుతో నింపివేస్తాం అన్నారు. 25 సంవత్సరాల అనుభవంవల్ల తేలింది. సంవత్సరానికి రాష్ట్రంమొత్తాన బాగాశ్రమజేస్తే 200 బేళ్ళకన్న ఖద్దరునూలు తయారుకాదని తేలిపోయింది. ప్రత్తికి ఖర్చులేదు. పనివారికి పనిలేదు. కట్టుటకు గుడ్డలేదు. నేయుటకు నూలులేదు మగ్గాలకు పనిలేదు. అదాయాన్నెట్లు పెంచగల్గుతారో బోధపడడంలేదు. ఖద్దరు ఎక్కడ వీలయితే అక్కడ గృహపరిశ్రమగ అభిమానించడానికి ఎవరికీ అభ్యంతరంలేదు. కానిఅసలు మూలమట్టంగా దేశంలో గుడ్డ ఉత్పత్తినే ఆపివేస్తే ఏమి కానున్నదో బోధపడడంలేదు.

మద్రాసు ప్రభుత్వం యుద్ధానంతర స్కీములో సాలుకు 18 గజాల గుడ్డ కేటాయించాలెనన్నది. పండిత నెహ్రూ అధ్యక్షతకు యేర్పడిన ఇండియా ప్లానింగు కమిటీ, తలకు సాలుకు 30 గజాలగుడ్డ యివ్వవలె నన్నది. మిల్లుగుడ్డ ఖరీదు సగటు గజం 5¾ అణాలు, నేతగుడ్డ 9¾ అణాలు అవుతుంటే ఖద్దరు రు. 1-7-10 అవుతున్నది. ఖద్దరు, ప్రోత్సహించ వలసిందే। కాని అసలు మిల్లులు ఆపితే ప్రజానీకపు వస్త్ర సమస్య తేలుతుందా? ధరలు భరించగలరా? ఈనాటికీ గుడ్డ చాలడం లేదు. బియ్యం కొరకు యితర దేశాలకు ప్రభుత్వం పంపు తున్నది. చెప్పకుండా బ్లాకు మార్కెటులో ఇతర రాష్ట్రాలు పోతున్నది. బ్లాకు మార్కెటును అరికట్ట వలెను. అదనపు మిల్లులను యేర్పరచి అధిక వస్త్రోత్పత్తి చేయాలి. మన మంత్రివర్గం మిల్లులు అక్కర లేదన్నది. కేంద్రప్రభుత్వం తీసుకోవాలిసిందే అంటున్నది. అప్పుడేమి చేస్తారంటే మంత్రి భాష్యంగారు ఇలా అన్నారు.

"మద్రాసుప్రభుత్వమే ఆ మరలనన్నింటిని తీసుకోవచ్చు. తరువాత మద్రాసు ప్రభుత్వం వారే (స్వంత యాజమాన్యంక్రింద) ఫ్యాక్టరీలను స్థాపించి, వాటిలో తయారైన నూలును, ఆ రకం నూలు తయారు కాని దేశాలకు ఎగుమతి చేయవచ్చు. లేక ఈ నూలు వస్త్రాలుగా నేయించి జావా, సింగపూరు, మలయా, కొలంబో మొదలైన దేశాలకు ఎగుమతి చేయవచ్చు" (ఆంధ్ర ప్రభ 30-11-46)

ఇతర దేశాలకు, పంపుతామంటారేగాని ఆ రాష్ట్రంలో గుడ్డ, నూలులేక బాధపడుతున్న రాష్ట్రంలోని చేనేత పారిశ్రామికులకు, తయారైన గుడ్డలేక బాధపడుచున్న ప్రజలకు అందిస్తామనరేం. ఇది మరలపై కోపమా! ప్రజలపై కోపమా! రాష్ట్రంలోనే చౌకగా ప్రజలకెందుకందించ గూడదు. ఈ పంధా ఎక్కడికి తీసికొని పోతున్నదో ప్రజానీకం గమనించాలె. కాంగ్రెస్ యేర్పరచిన ప్లానింగుకమిటీ ఆశయాన్ని అమలుకు వచ్చుటకు సర్వయత్నాలుచేయాలె.

## దుంపనూనె

ఆహార కరువు వలన, అధిక ధరలవలన రాష్ట్రంలోని ప్రజానీకపు దారుఢ్యం తగ్గిపోతున్నది. అవసర పదార్థాలు తిండిలోకి లేనేలేవు. ఉన్నా ధరలు పెరిగిపోయినవి. నెయ్యి, వెన్న సామాన్యులకు అపురూపం అయిపోయినవి. డాల్డా, వేరుశనగ నూనెలు అయినా లభిస్తే చాలురా బాబు అని తలుస్తున్నారు. అదీ కష్టం అయిపోయింది. వేరుశనగ వీశె కంట్రోలు ధర 1-8-4 ఉంటే రు 2-8-0 కు కూడా లభించడంలేదు. డాల్డా పౌను రు 1-4-0 వరకు ఉంటే దానిని కొనే జనం పెరిగిపోయి వందున దాంతోపాటు ధరకూడా పెరిగిపోతున్నది. వేరుశనగ ధర పెరిగింది. రైతాంగానికి ఆదాయంవస్తుందని తలుస్తే, రైతువద్ద ఉన్నప్పుడు తర్వాత ధరలో సగంకూడా ఉండడంలేదు. ధరలు తీత నాటికి, తర్వాత నాటికిసంబంధం లేకుండా పోతున్నవి. ఆరైతే తనయింటికి కనీసం వేరుశనగ నూనె అయినా వాడుకుందాం అంటే విపరీత ధర అవుతున్నది. మిల్లు ఆడించి వాడుకుందాం అంటే అందుబాటులోలేదు. దుంపనూనె మీద ప్రజల అవసరం గమనించి, పెట్టుబడిదారులు ఈ ఫ్యాక్టరీలకై ఎగబ్రాక సాగారు. బిర్లా ఉత్తర దేశాన్ని ఉద్ధరించి, కూలీలను, రైతాంగాన్ని దోచి ఆంధ్రలో అవతరించాడు. తాడేపల్లి వద్ద అలజడిచేసి రాయలసీమకు తరిమారు. అచట చిన్న చిన్న వ్యాపారులు వలదన్నా బిర్లాకే కంపెనీ యిచ్చారు. పెట్టుబడులతో దేశంలోని కూలీ, రైతులను దోచిన బిర్లాకు, గుంటూరు, నెల్లూరు జిల్లాల రైతాంగపు రక్తమాంసాలను పీలుస్తున్న వెంకటగిరి తోడయినాడు. ప్రభుత్వంలో ఉండి ప్రజలను జలగలవలె పీడించి వేధించిన జిల్లా కలెక్టరు తోడయినాడు. కోటీశ్వరుడు, జమీందారు, ప్రజాపీడకుడు కలిసి రాయలసీమ రైతాంగాన్ని పీడించ తుంగభద్రా తీరానికి చేరారు.

చిన్న చిన్న ఫ్యాక్టరీలను దిగమ్రింగటాన్ని గమనించాలి. దోపిడీ రాయుడు ఎవరైనా ఒకటే. ఆంధ్రుడైనా ఆంధ్రేతరుడైనా। తెలుగు

జిల్లాలో వేరుశనగ ఒక ముఖ్య పంట జిల్లాలు. వారీగా యీక్రిందిఉత్పత్తి గమనించండి.

| జిల్లా | ఎకరాలు | టన్నులు |
|---|---|---|
| విశాఖ | 250078 | 106300 |
| తూ. గో. | 14554 | 6910 |
| ప. గో. | 42961 | 20000 |
| కృష్ణ. | 174064 | 87000 |
| గుంటూరు. | 325605 | 146800 |
| కర్నూలు. | 509642 | 241800 |
| బళ్ళారి | 366855 | 174300 |
| అనంతపురం | 392148 | 186600 |
| కడప | 195104 | 97700 |
| నెల్లూరు | 9397 | 4460 |
| చిత్తూరు | 178370 | 84700 |

వీటివల్ల నూనెతీసి దుంపనెయ్యి ఉత్పత్తిచేస్తే అచటి ప్రజానీకానికి ఎంతో ఉపయోగం ఉంటుంది. వాల్కార్టు. రాలీ.లూయిూస్, కంపెనీల ద్వారా. వానియింగ్లీషు పెట్టుబడిదారులు దోచిపర సీమలకు పంపడం అనే పేరుతో అంతూ పంతూలేని లాభాలు. ఇటు రైతాంగం నష్టాలు అనుభవించడం జరుగుతున్నది. వీటిని నూనెగా దీసి ప్రజాపయోగంచేస్తే అచటి ప్రజానీకపు జీవితావసర పదార్థాల కుపయోగపడుతుంది.

ఈ ఉత్పత్తిచేసే దుంపనూనె కంపెనీలను స్థానికులకా ? జిల్లాకా ? యివ్వడం అనేది సమస్య కాకుండా. ప్రభుత్వమే పరిశ్రమలు ప్రారంభించాలి. కాని. ప్రభుత్వం పరిశ్రమలు ప్రారంభించేటంతవరకు అసలు యెవ్వరికీ యివ్వం అనడం సరిఅయింది కాదు అచటి రైతాంగానికి తమ ఫలసాయంకు ఒక కనీసధర హామీయివ్వాలి. అచట పనిచేసే కూలి జనానికి కనీస వేతనపు గ్యారంటీ ఉండాలి. వీటితోబాటు ఫ్యాక్టరీలో ఉత్పత్తి

అయ్యే దుంప నెయ్యిఖరీదు కంట్రోలు చేయాలి. ఖరీదు కంట్రోలు చేయడమేకాకుండా పంపిణీకూడా ప్రభుత్వాధీనంలో ఉండాలి. ఈ కనీస ధరల నిర్ణయం రైతులకు, కూలీలకు, వాడుకునే వారికి లాభసాటిగ ఉండవలెగాని మిల్లు యజమానుల కొట్లు నిండేటట్లు ఉండకూడదు. ఆవిధంగా హామీతో - ప్రభుత్వం తాను నిర్వహిస్తే సరే - లేకపోతే యితరులకిచ్చి అయినా పరిశ్రమలను ప్రోత్సహించితే అచట జనానికి ఆదాయం పెరుగుతుంది.

## సిమెంటు ఫ్యాక్టరీ

ఇండ్ల సమస్యవస్తే గృహనిర్మాణానికి సిమెంటు అత్యవసరం. ఆంధ్రదేశంలో సిమెంటుకు కావలసిన ముడిపదార్థాలు సమృద్ధిగాఉన్నాయి. ముఖ్యంగా సున్నపురాయి, ముగ్గురాయి బహుళంగా లభిస్తుందని ఆంధ్ర విశ్వవిద్యాపరిషత్తు ప్రకటించిన రెండు పుస్తకాలల్లో వివరించారు. కడప, కర్నూలు, పల్నాడు, విశాఖపట్టణ ప్రాంతాలలో సిమెంటు ఫ్యాక్టరీలు పెట్టుటకవకాశాలు పూర్తిగా ఉన్నవి. ఇవి కరువుప్రాంతాలనేది ఆంధ్రులకు నిత్యానుభవం. బెజవాడలో కృష్ణకు అటుయిటు రెండు ఫ్యాక్టరీఉన్నవి. సిమెంటు బ్లాకుమార్కెటు జరుగుతున్న సంగతి తెలిసిందే. సిమెంటుకై ఎన్నోయిబ్బందులు పడుతున్నారు. ఈరెండూ ఉత్పత్తిచేసినా ఎంతచేయగలవు? పైగా వీటికి రాయిరావలెనంటే 60, 70 మైళ్ళ దూరంనుండి రావలసివస్తున్నది. 14—0—1946 న రాజమహేంద్రవరంలోజరిగిన ద్వితీయ ఆంధ్రపారిశ్రామిక మహాసభకధ్యక్షతవహించిన డాక్టరు బి. వి. నారాయణ స్వామి నాయుడుగారు కర్నూలు, విశాఖపట్నాలలో సిమెంటు ఫ్యాక్టరీలు పెట్టడం అవసరమని హెచ్చరించారు.

ఈవిధంగా పరిస్థితులుండగా, కర్నూలులో సిమెంటు ఫ్యాక్టరీ కట్టుటకు కేంద్రప్రభుత్వంవద్ద అనుమతి సాధించిన బి. సి. శేషారెడ్డిగారికి మద్రాసు ప్రభుత్వం తాము పరిశ్రమలను జాతీయపరంచేసి అన్నిపరిశ్రమలను ప్రభుత్వమే నిర్వహించబోవుచున్నదని, అందుచే ఈఫ్యాక్టరీకై ఎవరి

తోనూ ఎట్టిఖరారులు పడవలదని పరిశ్రమను ప్రారంభించడానికి పూనుకో వలదని హెచ్చరిస్తూ నోటీసు పంపింది. (హిందూ 16-11-46)

ఇటు రాయలసీమలో కొందరు పరిశ్రమలు ప్రారంభించుటకు అవకాశం ఇవ్వండీ అని కోరితే. పరిశ్రమలను జాతీయపరం చేయబోతు న్నామని. వీలులేదని చెప్పారు. మరొకవైపు "చెన్నరాష్ట్రంలో ఏ భాగంలోనైనా బంగారం, ఇనుము, రాగి, తుత్తునాగం, సుద్ద, సత్తు మున్నగువాటి ముడిపదార్థాల ఉనికిని గురించి, పరిశోధనలు సల్పుటకు, గనులనుంచి వాటిని త్రవ్వించుటకు ప్యారీ కంపెనీవారికి రివెన్యూబోర్డు లైసెన్సు లిచ్చింది." (ఆంధ్రప్రభ 30-11-46) ఈ ప్యారీ కంపెనీ ఇంగ్లీషు పెట్టుబడిదారులది అనేది అందరికి తెలిసింది. ఈ కంపెనీకి సామర్లకోటలో పంచదార ఫ్యాక్టరీ ఉంది. ఆపేడుతో తూర్పు గోదావరి రైతాంగాన్ని దోస్తున్నాడు. కోలారు బంగారు గనులల్లో భాగాలున్నాయి. ఈ కంపెనీ తయారుచేసే జాడీలు ప్రతియింట్లోనూ వాడుతున్నారు. అధిక ధరలకు, ఈతని దోపిడీకి లోనుకాని ఆంధ్రకుటుంబం ఉండదు. పిప్పర మెంటు ధరలు తెలిసిన ప్రతివారికీ ఇతనిదోపిడి తెలుసు. ఇంతవరకుచేసిన దోపిడీ చాలక ఈనాడు మద్రాసు రాజధానిలోని ఖనిజసంపద అంతా ఇతనిపరం అవుతున్నది. ఇంగ్లాండు సామ్రాజ్య ప్రభుత్వం ఇంగ్లాండు లోని గనుల నన్నిటిని ప్రభుత్వపరం చేసింది. వివిధ దేశాలల్లో పంశోధ నలు విశ్వవిద్యా పరిషత్తులకు, శాస్త్రజ్ఞులకు అప్పగిస్తున్నాయి. పరిశ్రమలు జాతీయపరం జేస్తామనీ. ఇతరులెవరూ పరిశ్రమలు ప్రారంభించవలదని నిషేధిస్తున్న మద్రాసు రాష్ట్రంలోని జాతీయ మంత్రివర్గం, బ్రిటిషు పెట్టు బడిదారులకు మద్రాసు రాష్ట్రంలోని జాతీయ సంపదయగు ఖనిజసంప త్తును అప్పగించింది.

రాష్ట్ర ప్రభుత్వమే స్వయంగా పరిశ్రమలను నిర్వహిస్తుందనే ఆశ యిదివరకేమైనా ఉండేదేమోగాని. రాష్ట్రంలోని పంచవర్షక ప్రణాళికకు సంబంధించిన అభివృద్ధి పనులకు పెట్టే ఖర్చు మొత్తము 153 కోట్ల నుండి, 80 కోట్ల రూపాయలకు ఎప్పుడు తగ్గించవలసి వచ్చిందని

తగ్గించావో, అప్పటితో నిరాశరాకతప్పదు. ఈ పంచవర్ష ప్రణాళికలోను రోడ్లక్రింద అధికంగా ఉంచకతప్పలేదు. ఉంచుతున్నామనికూడాచెప్పారు. రోడ్లఅభివృద్ధికై ప్రత్యేకించిన మొత్తాన్ని తగ్గించమని నేనూ కోరను. కాని ఈపరిస్థితులలో రాష్ట్ర ఆర్థిక పరిస్థితులను బట్టేగా 150 నుండి 80 కోట్ల రూపాయీలకు అభివృద్ధిని తగ్గించింది. అందువలన పరిశ్రమలకు ఎక్కువగా ఏవిధంగా ఖర్చుచేయగలుగుతారు? అందువలన మద్రాసు ప్రభుత్వం తాను నిర్మించదలచిన—నిర్మించగలిగిన — పరిశ్రమలలో పెట్టుబడిదారులకు లాభాలు, ఉత్పత్తివాడులకు, వాడకం దారులకు కనీసధరలు నిర్ణయించి, ఇతరులకుకూడా పరిశ్రమలు నిర్వహించుట కనుమతియిస్తే రాష్ట్రంలో పరిశ్రమలు అభివృద్ధికావడానికి ముఖ్యంగా వెనుకబడియున్న ఆంధ్రప్రాంతం త్వరలో అభివృద్ధి పొందడానికి అవకాశం యిస్తుంది.

ఆంధ్రప్రాంతంలో రాయలసీమ ఆర్థికంగా చాలావెనుకపడియున్న సంగతి నిర్వివాదాంశం. రాయలసీమ ప్రజానీకానికి జీవనం కల్పించవలెనంటే, లక్షలకొలదిజనం రెండు సంవత్సరాలకొకమారు కరువువాత పడకుండా ఉండాలెనంటే ప్రాజెక్టులు, పరిశ్రమలు పెంపొందితీరాలె. అందుకు పూనుకొని తామే ముందుకు రావలసినదానికి బదులు అడ్డుతగలడం ధర్మంకాదు. వ్యక్తిగత పెట్టుబడిదారులను అభివృద్ధి పరచదలచడం లేదన్నందుకు సంతోషమే. ఆకారణంతో వెనువెంటనే జరుగగల అభివృద్ధిని అడ్డగించడం న్యాయంకాదు. ఆంధ్రరాష్ట్రంలో పరిశ్రమలు తక్కువ. అందుచే పారిశ్రామికాభివృద్ధి జరిగిననేగాని ప్రజానీకపు జీవన ప్రమాణం పెరుగజాలదు. వృత్తులు పెరుగవలె. జనానికి పనులు లభించాలె. ఆంధ్రాభివృద్ధికి, అందునా రాయలసీమాభివృద్ధికి అడ్డుతగలడం సబబుకాదు. ప్యారీకంపెనీని ఇంగ్లీషుపెట్టుబడిదారులకు మొత్తం గుత్తకివ్వడం మానివేయాలి.

ఇదివరికే అవిశ్వాస ప్రకటనలతో మితిమీరిన రాయలసీమ సర్కారుల వివాదాలను అప్పుడే సామివెంకటాచలంచెట్టిగారు లేవనెత్తి వివాదా

లకు దారితీయ ప్రయత్నిస్తున్నాడు. ఈ వివాదాలెలా ఉన్నా ప్రజా ఆదాయానికి ప్రాతిపదిక చూపినవారు కాగలరా? బిర్లా కంపెనీ, కేంద్ర ప్రభుత్వంను వత్తిడిచేయగలదు కనుక మానివేసితిరా? సిమెంటుఫ్యాక్టరీ స్థాపనకు పరిశ్రమలు జాతీయుపరంచేయడం అడ్డంకియా? గుడ్డల మిల్లులను పెంచుటకు ఖద్దరుస్కీము అడ్డంకా! అధికాహారోత్పత్తికీ, బంజరు భూముల సాగుకూ రూల్సులు అడ్డంకియా? జమీందారీరద్దుకు 1935 ఆక్టు అడ్డంకా? భూములలో పంటలకు జమీందారులు భూస్వాములు కాదంటే రైతాంగానికి 144 సెక్షన్ ప్రయోగమా? రోజుకు రోజూ కాల్పులూ—అరెస్టులూ, లాఠీచార్జీలు పోలీసులకు స్వేచ్ఛా?

దీర్ఘంగా ఆలోచించాలి. నేటి మనమంత్రివర్గం ప్రజలచే ఎన్నుకోబడి ప్రజాహృదయ పీఠము అధివసించి వచ్చిన మంత్రివర్గం. ఎన్నో ప్రజాపోరాటాల్లో ముందుకు నిల్చిన కాంగ్రెస్ సంస్థ తరపున వచ్చిన మంత్రివర్గం. ప్రజామంత్రివర్గం అనిపించుకోవడానికి అంతకు ముందున్న రాజకీయజీవితం మాత్రమేకాక ఆచరణకూడా అవసరంకాదూ? కూడూ, గుడ్డా, పరిశ్రమలు. జీవితానికింత సుఖంకలిగిస్తుదనే ఆశతో, విశ్వసించి, మంత్రులను చేశారు. బ్రిటీషుప్రభుత్వం అనేక కుతంత్రాలు పన్నుతున్నది. తన దుష్టకార్యాలను వీరిచేత సాగించుకుంటున్నది. మంత్రివర్గం . రాష్ట్రాభివృద్ధికి ప్రణాళికలు ప్రకటించడం అటుంచి పట్టుమని చేసింది కాన్పించదు. స్థానిక పరిపాలనకు ప్రజల ఎన్నికలు లేకుండా చేసివేశారు. రాష్ట్రాభివృద్ధి కింతవరకు చేసిన రాజకీయ, సాంఘిక, ఆర్థిక ప్రయోజనాలేమాయని ప్రజానీకం ఎదురు చూస్తున్నది.

కావున ఈవిషయం సింహావలోకనం చేయండి. ఈ పాడువారిన బ్రిటీషుసామ్రాజ్యవాదులు ప్రజాభివృద్ధికి అడ్డుతగిలారు. పరిశ్రమలకు, వ్యవసాయానికి, విజ్ఞానానికి వారు అడ్డుతగిలిన విధంగా మరొక ఆశయంతో, పేరుతో, మన మంత్రివర్గం అడ్డుతగలడం న్యాయంకాదు. ఈ పోలీసు నిరంకుశత్వాన్ని, హత్యాకాండను తుదముట్టించి ప్రజాజీవనాన్ని సుఖవంతంచేసి, భారతస్వాతంత్ర్య విఘాతకులగు బ్రిటిష్‌సామ్రాజ్యవాదులతో

సాగించే అంతిమ పోరాటానికి ప్రజానీకం తయారయ్యే విధంగా ప్రజా జీవనాదాయం ఉన్నత పరుస్తారని, ప్రజామంత్రివర్గం పేరులోనేకాక, ఆచరణలోకూడా చూపుతారని, ప్రజలకు తిన తిండి, కట్ట బట్ట, ఉండ నిల్లు, విశ్రాంతి–శాంతి కలిగించుటకు, ఆంధ్రప్రజానీకం కనుదెరచి పరిస్థితులు గమనించి మంత్రివర్గంపై తమ వత్తిడితెచ్చి పౌరసత్వహక్కులు సాధించండి. అనాడే ప్రజాబలాన్ని పెంపొందించగలుగుతాం. కాంగ్రెసు ఆశయం సఫలం అవుతుంది.



ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ—కె. 13/సి.—6000 కాపీలు—10–12–46.

ప్రకాశంగారి

# వస్త్రవిధానం

ములు జరిగితే




రచన:

త్సల సత్యనారాయణ

ప్రచురణ

ప్రజాశక్తి, బెజవాడ

A

1959?

"ఖాదీఫిర్కాల" స్కీముపెట్టి 3 కోట్లరూపాయిలు ఖర్చుపెడతాననగానే రాష్ట్రంలో అలజడి బయలుదేరింది. ఖాదీభక్తులైన కాంగ్రెస్ నాయకులే డాక్టరురాజన్ - యస్. యస్ వరదాచారి వగైరాలు దానికోసం 3 కోట్లు రూపాయిలు వెచ్చించడం 'దుబారా' అవుతుందని శాసనసభలో సందేహం వెలిబుచ్చారు.

ఇంతటితో ఆగక, ప్రకాశంగారు ఖాదీ సిద్ధాంతం కోసం మిల్లులను అరికడ్తానని ప్రకటించారు. వెంటనే తమిళనాడ్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఆ విధానాన్ని ఖండించింది. ఒక మంత్రి గూడా ప్రకాశంగారి నిర్ణయం మంత్రి వర్గంయొక్క సమిష్టి నిర్ణయం కాదన్నాడు. తనకు సమ్మతం కాదన్నాడు. మన రాష్ట్రంలోని ఆంధ్ర, అరవ, ఇంగ్లీషు దిన పత్రికలన్నీ (జన్మభూమి తప్ప) ప్రకాశంగారిని ప్రతిఘటించాయి. ఖద్దరు కోసం మిల్లులను అరికట్టడం "అభివృద్ధి నిరోధక"మని ఆంధ్ర పత్రిక రాసింది. ఇది "ఎదురీత" 'దుస్సహ విధానం' "మంత్రులు క్రిందా, మీదా పడి ఏకాభిప్రాయానికి వచ్చినా రాష్ట్ర ప్రజలు ఎదిరించి తీరుతారు"అని ఆంధ్రప్రభ రాసింది........

ఆంధ్ర వాణిజ్య మండలి - దక్షిణ భారత వాణిజ్య మండలి - మలబారు మండలి - ప్రతిఘటిస్తున్నాయి. పోనీ వీరంతా పెట్టుబడిదార్లు, స్వంతలాభాల కోసం దేవుళ్ళాడ్తున్నారనుకోవచ్చు - రెండోవైపున రాష్ట్రంలోని అన్ని రైతుసంఘాలు, కార్మిక సంఘాలు ఖండించాయి. రాటంవల్ల మాకడుపు నిండదు. ఖాదీవల్ల మాగుడ్డకరువు తీరదంటున్నారు.

ఇంత గొడవ జరుగుతున్నా ఆంధ్ర కాంగ్రెసు శాసనసభ్యులొక్కరూ నోరుమెదపడంలేదు.

కాంగ్రెస్ 1880 లో స్థాపించబడినప్పటికీ - జలియన్‌వాలాబాగ్ దురంతాలైనాకనే — 1920 నుండి మాత్రమే స్వాతంత్ర్యం పిటీషన్‌లతో

రావనీ, పోరాడిసంపాదించాలనీ గాంధీగారి నాయకత్వంక్రింద పంథా మార్చింది. సహాయనిరాకరణోద్యమం, శాసనోల్లంఘనోద్యమం ఆ తర్వాత వచ్చాయి. రోజురోజూ బ్రిటిష్ ద్వేషం పెరిగింది ప్రజల్లో. రాజకీయంగా బ్రిటిషువారితో పోరాడాలన్న గాంధీజీయే ఆర్థికంగా మనబీద ప్రజలంతా బాగుపడ్డానిక్కి ఖద్దరు దీక్షబూనమని హెచ్చరించాడు. ఈ ఖాదీవల్ల ఒక్కదెబ్బలో 2 పిట్టలురాల్తాయన్నాడు. ఒకవైపున బ్రిటిషు వస్తుబహిష్కరణకు దారిదీసి, ఇంగ్లీషువాడి గోపిడిని అరికట్టుతుంది. రెండోవైపున గ్రామాల్లో పేదలందరికీ పనికల్పిస్తుంది, వారిఆదాయాన్ని ఏకొద్దిగానైనా పెంచుతుంది. విదేశీ వస్త్ర దహనోద్యమాన్ని లేవదీసే సరికి ఉద్యమం ముదిరింది. అప్పటినుండి ఖద్దరు కడితేనేగాని కాంగ్రెస్‌లో ప్రముఖస్థానంలేదు. ఖాదీప్రచారంకోసం, దాని ఉత్పత్తి కోసం, గాంధీగారు కోట్లకొద్ది రూపాయలు వసూలుచేసారు. ఖద్దరు కడితే సామాన్యమైన దేశభక్తికి చిహ్నమైంది. నూలు సంపన్నులు వడి కితే ఎక్కువ దేశభక్తికి చిహ్నమైంది. అందరిచేత వడికించడానికి వడికిన నూలే కాంగ్రెసు సభ్యులు సభ్యత్వచందాగా చేయ ప్రయత్నించారు. 1931 లో గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం సత్యాగ్రహం విరమించు కున్నా, విదేశవస్త్ర పికెటింగు షరతు పట్టుబట్టి సంపాదించారు. నాయకు లను గౌరవించడానికి పూల మాలలకు బదులు నూలు చిలపలు వెలి సాయి. కాంగ్రెసు పోరాటాల్లో పాల్గొన్నవారంతా ఖాదీధారులే. 1920 నుండి ఖద్దరు చరిత్ర కాంగ్రెసు చరిత్రలో ఒకభాగమే. కాంగ్రెసుకు ఖద్దరుకు ఇంత అవినాభావ సంబంధం ఏర్పడ్డందువల్ల ఇపుడు "ప్రకాశం స్కీము" ను ఎదిరించడమంటె ఆంధ్ర యం. యల్. ఏ. లందరికీ భయం గలగడం సహజమే.

• ఒకదానిమీద పూజ్యభావం వుండొచ్చు. కాని అది మనలను అంధులను చేయరాదుగదా? మద్రాసుమంత్రివర్గమొకటే ఈ దారిదొక్కట మేమి? మిగతా రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రులు తొక్కకపోవడమేమి? ప్రకాశంగారు మిల్లులు "వద్దం" టూవుంటే జవహర్‌లాల్, రాజేంద్ర బాబు, పటేలు మొదలయిన ఢిల్లీ మంత్రులు "పుచ్చుకోక తప్పదన" డ మేమి? ఖాదీమీద ప్రకాశంగారికున్న పూజ్యభావం వారికిలేదా? ఈయన కన్నా వారు తక్కువ దేశభక్తులా?

# ఖాదీ ఎంతవరకు అభివృద్ధి కొచ్చింది ?

దీన్ని అభివృద్ధి చేయడానికి తక్కువ పాట్లు బడలేదు. పరీక్ష కొరకు కాంగ్రెస్ నిబంధనావళిలో ఖాదీధారణ నిబంధన పెట్టి చూచారు. ఫలితం సంతృప్తిగా లేదు. కోట్లు పెట్టుబడితో అన్ని రాష్ట్రాలలో చరఖా ఉత్పత్తిసంఘాలేర్పర్చారు. ఐనా తగినంత వ్యాపించలేదు. 1937-42 కాంగ్రెస్ మంత్రివర్గాలున్నప్పుడు ఖద్దరు గ్రాంటులు లక్షలాదిరూపాయలు ఇప్పించారు. చెప్పుకోదగ్గ అభివృద్ధి లేదు. వేషంకోసం ఖాదీ కట్టేవారు పెరుగుతున్నారని చెప్పి — చరఖాసంఘంలో "అన్ని రూపాయిలిస్తే ఖద్దరమ్మకూడదు" — వడికిన నూలు కొంత యివ్వాలన్నారు. దీనితో మడికట్టుకున్న చర్ఖాసంఘాల్లో అమ్మకాలు తగ్గాయి. సర్టిఫికెట్ లేని ఖద్దరుకొట్లలో అమ్మకం పెరిగింది. వేషానికి ఏ కొట్లో ఖద్దరయినా ఒకటేగా! ఇంక ఈ వేషధారులను ఓడించలేక గాంధిగారే ఈ మధ్య "గిజ" అన్నారు. కాంగ్రెస్‌లో ఈ ఖాదీనిబంధన తీసేయకపోతే మనల్ని మనం మోసంచేసుకున్నట్టే అన్నారు.

ఒక దశలో ఖద్దరుమోజు బాగా వ్యాపించితే జపాన్‌వాడుగూడా "ఖాదీ"అని రాసి మిల్లుతానులు దింపాడు. మహాదేశభక్తులు, గాంధీజీకి ఆత్మీయులు, అహమదాబాదు మిల్లుసేట్లుగూడా కక్కుర్తిపడి ఆ పని చేశారు. ప్రజలు కోరుకుంటున్నదిగూడా యిదేగనక బాగానే ఖర్చయ్యేది. ఈ మోసాల్ని కాంగ్రెస్ తర్వాత నివారించి నిజమైన ఖాదీ సిద్ధాంతంకే బాగా కృషి చేసింది.

ఇటీవల చర్ఖాసంఘంవారు ఒక సం॥రం 82 ½ లక్షల చతురపు గజాలు మనదేశంలో తయారుచేసినట్టు, దాని ఖరీదు 102 లక్షలరూ॥లని ప్రకటించారు. అంటే దామాషాను గ 1 కి రు 1-3-9 అయింది. మన దేశంలో మిల్లుల్లోనూ, చేనేతమీద మిల్లు నూలుతోనూ మొత్తం 680 కోట్లు గజములబట్టతయారౌతుంటే, ఇందులో ఈ 80 లక్షలెన్నోవంతు ? 700 మ.ది మనుష్యుల్లో ఒకనికి సరిపడ్డ ఖాదీ తయారౌతుందన్నమాట. అనగా తల 1 కి గ 16 గజాలు బట్ట మన కొస్తే, అందులో మిల్లుబట్ట గ12 లుందన్నమాట. చేనేతబట్ట 3 గజాల, 2 అడుగుల, 11¾ అం॥ లుందన్నమాట. ఖద్దరు¾అం॥ వుందన్నమాట. మద్రాస్‌టెక్స్‌టైలు కమీషనర్ ప్రకటనప్రకారం మన చెన్నరాష్ట్రంలో నెల కోటా 12428 బేళ్లకు

రు 93,21,000. బేలు 1 కి 1500 గజముల చొప్పున, గజము 1 కి రు 0-8-0 ఖరీదైంది.

మిల్లుబట్టగాని, మిల్లునూలుతో చేమగ్గంమీద నేసేబట్టగాని 700 మంది కడితే, ఒక్కడు ఖద్దరు కట్టడానికి ముఖ్యకారణం ధర వ్యత్యాసం. అది సగటున గజము 0-8-0 ఐతే ఇది రు 1-4-0. రెండవది రు 1-4-0 పెట్టినా ముతగ్గాను గొగ్గిగాను ఖాదీ ఉంటుంది. గ 1-4-0 కు నె 10 ముతక బట్ట వస్తుంది. 0-8-0 అయినా మిల్లు గుడ్డ నె 20 తో తుల్యంగా సన్నంగా నాజూకుగా వుంటుంది.

పోనీ యింత ఖరీదు పెట్టికొంటే అవతల వడికే వారికేమైనా మడులు మాన్యాలు దక్కేయా? ఒక లక్షమంది వడికేవారికి సంవత్సరంకు 34 లక్షల రూపాయిలు కూలి యివ్వబడింది. సంవత్సరంకు రు 34 లు. నెలకు రు 2-13-0. రోజుకు 0-1-6. ఇది ఒక మనిషికి గాదు. ఒక కుటుంబంలో సాధారణంగా ఒక రాటమే వుంటుంది.

స్త్రీలు పురుషులు తమ యిల్లువిడచి పైకివెళ్ళనక్కరలేదు. గనుక కుటీరపరిశ్రమము పవిత్రమైన వంటారు

కూలి తక్కువైనదైనా స్వతంత్రమైన వృత్తి గౌరవభాజనమైంది అంటారు. అయితే ఊడ్పుల్లో - కోతల్లో గుంపులు గుంపుయిగా పొలాల్లో దిన కూలి కోసం ఈ వడికే స్త్రీలంతా ఎందుకు పోతున్నారు? కాకినాడలో ఎందరో స్త్రీలు పీచు కార్ఖానాల్లో పని చేస్తున్నారు. రాజమండ్రిలో, గుంటూరులో, చీరాల్లో వేలకొద్దీ స్త్రీలు ఐ. యల్. టి. డి. పుగాకు కార్ఖానాల్లో పని చేస్తున్నారు. వీరంతా ఆ పని మానేసి రాటాలు పెట్టుకో రాదా? రాటాలు పెట్టించాలంటే ఆ కార్ఖానాలను గూడా మూయించాలేమో! స్త్రీ ఇంట్లోనే కూర్చోవాలనే "భేషజం" సంపన్నులకుంటే వుండుగాక. రెక్కాడితేనెగాని డొక్కాడని కుటుంబాలకు, పదిమంది స్త్రీలుకల్సి పురుషులతో పాటు ఒక కార్ఖానాలోగాని, పొలంలోగాని పనిచేయగూడదనే బేషజం వుండదు. మద్రాస్ వగైరా పట్టణాల్లో చదువుకున్న స్త్రీలే ఎందరు పురుషులప్రక్కను గూర్చుని ఆఫీసుల్లో పనిచేస్తూ జీతాలు సంపాదించుకోడంలేదు! మన ప్రధాని ప్రకాశంగారి సెక్రటేరియట్ బిల్డింగ్‌లోనే వందలాది స్త్రీలు గుమస్తాలుగా టైపిస్టులుగా పనిచేస్తున్నారు.

హౌసుల్లో మధ్యతరగతిలోగూడ ఇంటింటికి ఒక దాసీమనిషి ఉంది. అంట్లుతోమడానికి, ఇళ్లు వాకిళ్లు తుడిచి నీళ్లు తేడానికిన్ని. ఈ కూలీ స్త్రీలంతా గౌరవ భాజనంగా ఇంట్లో "రాటం" వడుక్కోక దాసీపని చేయడం దేనికి? రాట్నంవల్ల కడుపునిండదని గదా!

## రాట్నం సిద్ధాంతం

గాంధీగారు 29-9-40 హరిజన్‌లో యిలా రాసారు: పండిత్ నెహ్రూ భారీ పరిశ్రమలు కావాలంటాడు. వాటిని సామ్యవాద సిద్ధాంతం ప్రకారం ప్రజాపరంచేస్తే — పెట్టుబడిదారీ విధానంలోని దోషాలనుండి కాపాడుకోవచ్చునంటాడు కాని నావుద్దేశం ప్రకారం ఎంత సామ్యవాద సిద్ధాంతాలమీద నడిపినా ఆందోషాలుండే తీరుతాయి." అంచేత భారీపరిశ్రమలన్నీ పాపభూయిష్టమే అంటారా? గాంధీగారి ఆశీర్వాదంతో అగర్వాలాగారు తయారుచేసిన "గాంధియన్‌ప్లాన్"లో తుపాకులు, బాంబులు, టాంకులు వగైరా దేశరక్షణకు భారీపరిశ్రమలు తప్పవన్నారు. ఎలక్ట్రిసిటీ. గనులు — ఇనుము — ఉక్కు — రాక్షసబొగ్గు — మిషన్‌పార్టులు - ఇంజనీరింగ్ — స్టీమర్లు—రైళ్ళు—విమానాలు - కార్లు—ఎరువులు - రసాయనములు కొన్ని ఇంగ్లీషుమందులు-పాపం! పేపరుమిల్లులుచేర్చలేదు. దినపత్రికలు లేకండాపోవాలనే వుద్దేశంకాబోలు! లేక చేతికాగితంతో దినపత్రికలు నడపగలమనేమో!—ఇవన్నీ భారీపరిశ్రమల్లోనే తయారవ్వాలన్నారు. తప్పదన్నారు. భారీపరిశ్రమలు పాపభూయిష్టమైనప్పుడు ఇవన్నీ ఎందుకో? ఇన్నింటిలో పాపంలేదని తోస్తే ఇక ఒక్క నూలుమిల్లులు గుడ్డల మిల్లుల్లోనేనా పాపం అంతా కరుడు గట్టింది?

కాంగ్రెసు చరిత్రకు ఖద్దరుకు ఎంతోదగ్గర సంబంధం వున్నందు వల్ల దానికోసం తహతహ లాడుతారు. ఇతర పరిశ్రమలతో అంత సంబంధం లేనందున-మిగతావన్నీ భారీపరిశ్రమలు లేస్తున్నా-ఆ పోటీకి చిన్న పరిశ్రమలు పోతున్నాయని గోలచేయరు. ఉదాహరణకు కాంగ్రెసు మంత్రులు స్వయంగావెళ్ళి[వనస్పతి]డుంపనెయ్యిఫ్యాక్టరీలకు శంఖుస్థాపన చేశారు. నూనెగానుగులకు ఆవునెయ్యికి పోటీగదా? సిద్ధాంత వేత్తలైన కుమారప్పగారు-ఇట్లా డుంపనెయ్యి ఫ్యాక్టరీలకు కాంగ్రెసు మంత్రులు శంఖుస్థాపన చేయడం సిగ్గుచేటు అన్నారు. ఆయన అన్నాగాని మంత్రులు లక్ష్యంచేయరు — డుంపనెయ్యి విషయంలో.

గ్రామ స్వయంపోషకత్వం—కుటీరపరిశ్రమల పవిత్రత ఖాదీసిద్ధాంతం ఇవన్నీ ఒకానొకదశలో అన్నిదేశాల్లోనూ ఏదోరూపంగా బయలు దేరుతూనేవున్నాయి. అల్పకాలంలోనే ఆసిద్ధాంతాలు నశించాయి. క్రీ॥శ॥ 1790 సం॥ ప్రాంతంలో ఇంగ్లండులో లడ్డైట్సు ఉద్యమం లని బయలుదేరింది. "స్పిన్నింగుజెన్నీ" అనేచేతితోతిప్పే మరకమగ్గాల యంత్రాలను తగులబెట్టా వుండేవారు. అక్కడ మొదట చేనేత మగ్గాలవారు ఇతర వృత్తులులేక-అ స్తమానమూ మగ్గంతో నేస్తూనే వుండడంవల్ల వాట్నవునూలు సప్లయిచాలలేదు అంచేత నూలుఉత్పత్తి పెరగడానికి "స్పిన్నింగ్‌జెన్నీ" [చేతియంత్రం] కనిపెట్టారు. దీనివల్ల మనదేశంలో గూడా చేతినూలు యంత్రముకు లక్షరూపాయలు బహుమతి ఇస్తాము కనిపెట్టితెమ్మని గాంధిగారు వెనకప్రకటించారు. రాట్నంపడికే వారింపటికి ఆగ్రహం వచ్చింది. తర్వాతినూలుఉత్పత్తి పెరిగింది. చేతిమగ్గం దాన్నంతా ఉపయోగించ లేకపోయింది. అంచేత యంత్రమగ్గంకోసం పరిశోధనచేశారు. పవర్‌మగ్గం కనిపెట్టారు. మళ్ళీ ఈ పవర్‌మగ్గానికి "జెన్నీ" నూలుచాలక స్పిన్నింగ్ యంత్రం కనిపెట్టారు.

ఇంగ్లండ్‌లో లడ్డైట్సు ఉద్యమంవంటిదే రష్యాలో నరోడ్నిక్ ఉద్యమం 1912 వరకు వుంటూవుండేది. వీరుగూడా చిన్నపరిశ్రమలవృద్ధికోసం భారీపరిశ్రమలు పనికిరావంటూ వుండేవారు. కాల ప్రవాహంలో అన్నీకొట్టుకుని పోయాయి. చరిత్ర ముందుకుపోతూంది.

కుటీరపరిశ్రమసిద్ధాంతం సాధారణంగా చిన్నవుత్పత్తిదారులవాదం. వీరు చెప్పేదేమంటే "నే నింతకన్నా ఎక్కువ చచ్చినా తయారు చేయలేను. ప్రజల కెక్కువ సరుకులవసరమున్నాగాని ఇంతటితో సరిపుచ్చుకోవాలి. ప్రతివానికి — పంచ, చొక్కా. కోటు, కండువా, దుప్పటి, తుండు కావాలంటే నేను తయారుచేయలేను. కొంచెంరంగవస్త్రంతో బ్రతకడం నేర్చుకోవాలి". ఇంతటితో ఆగక దీని కొక తత్వశాస్త్రం తయారుచేస్తారు. "కోరికలను మితపర్చుకోకపోతే ఎలాగ? మనస్సు కోతిలాంటిదిగదా! అడిగింపల్లా యిస్తుంటే యింకా తెమ్మంటుంది." ఇంకా ఏమంటారు? "భారీపరిశ్రమలవల్ల భాగ్యవంతు డింకా భాగ్యవంతుడౌతాడు సుమా! పేదవాడింకా పేదవాడౌతాడు. పెట్టుబడిదారీ విధానం పాపకారి! దాన్ని పెరగనీయవద్దు!" ఇతను జమీందారీ జాగీరు యుగాన్నికూడా ఖండిస్తాడు. శాస్త్రం చెప్పినాసరే — షూద్రులు

చదువుకోడానికి అర్హులు కారంటే కళ్ళెఱ్ఱజేస్తాడు. సమానత్వ సిద్ధాంతం మంచిదేనంటాడు. జమీందారు భూములన్నీ లాక్కొని పంచిపెట్టడం మంచిదంటాడు. అంతవరకు అతనభివృద్ధికారుడే. కాని, నూతిలో కప్పలాగ పెట్టుబడిదారీ చట్రంనుండి పైకిరాలేడు. కానితనకోసం ప్రజల కవసరాలున్నా మానుకొని కొద్దిలో సరిపుచ్చుకోవాలంటాడు. "నిరాడంబర జీవనం - ఉత్తమలక్షణం" అంటాడు.

ఇంక పెద్ద ఉత్పత్తిదారుడు (కోటీశ్వరుడు) చెప్పేదేమంటే — "ప్రజల కెన్ని కావలిస్తే, అన్నీ నా ఫ్యాక్టరీలో తయారుచేయగలను. నాకు కావలసిన ధర యిచ్చి కొనుక్కొంటూ వుండాలి. మీ కొనుబడి శక్తి తగ్గితే నేను మిల్లు ఆపివేస్తాను. కొనుక్కోలేనివాళ్ళ ఖర్మం వాళ్ళనుభవించవలసిందే". ఇంకా ఏమంటాడు? "చేతిపరిశ్రమలవల్ల సరుకుల ధరలు పెరిగివుంటాయి. ప్రజలు కొనుక్కోలేరు. భారీపరిశ్రమలవల్ల సరుకులు చౌక అవుతాయి. అంచేత మీ కిది లాభం. నాగరిక జీవనానికి కావలసినన్ని సరుకుల్ని చౌకగా కొనుక్కొంటూవుంటేనే జాతి వైజ్ఞానికంగా అభివృద్ధికొస్తుంది. అంతేగాని కుటీరపరిశ్రమలనీ, సమానత్వ సిద్ధాంతాలనీ భ్రమల్లో పడకండి. సమానత్వ సిద్ధాంతం సృష్టికి విరుద్ధం. ఎవరి శక్తిసామర్ధ్యాలనుబట్టి వారికి అదృష్టం లభిస్తుంది."

ఈ చిన్న వుత్పత్తిదారుడు, పెద్ద వుత్పత్తిదారుడు, ఇద్దరు గూడా తమ స్వంతలాభం కోసంచెప్పే వుపదేశాలేగాని ప్రజాభివృద్ధి కోసంకాదు. వ్యక్తిగతలాభం అనే చట్రంలోంచి పరిశ్రమలుపైకి రాకుండా ఎవరి మట్టుకువారు పాకులాడుతున్నారు. బీద ప్రజానీకం దృక్పథం వేరుగా వుండాలి. మొదటివాని వేదాంతం వింటే దేశంలోని దరిద్రంపోదు. దరిద్రాన్ని నిరాడంబర జీవనం అంటే మోసపోము. సమస్యను పరిష్కరించలేక, తప్పించుకొని పారిపోయి, వేదాంతోపదేశం చేస్తాడు, ఇతను చెప్పేది "మనిషికింత కూడు, జానెడుగుడ్డా ఉంటే సరిపోతుంది". ఇది బిచ్చగానిమీద దాతకుండే దృక్పథం. ఈ సిద్ధాంతమే జాతికి అభివృద్ధి నిరోధకం. ఇక రెండవవాని సిద్ధాంతం భారీ పరిశ్రమలతో స్వేచ్ఛా వ్యాపారం. అధునికశాస్త్ర పరిశోధనా ఫలితంగా వచ్చిన లాభాన్నంతా తానే కొట్టెయ్యాలంటాడు. రాసులుకొద్దీ సరుకులు తయారుచేసి 40 కోట్ల మందికి చౌకగా అవసరాలన్నీ తీర్చగల పారిశ్రామిక శక్తిని తాను గుత్తగొని - తన చేతిలోంచి పైకి పోకుండా, దానిమీద నూటికి నూరు

పాళ్ళు తనకే అధికారం వుండాలని దురాశ. మొదటివాడు కరువును నివారించడానికే ఒప్పుకోడు. కరువును కరువుకాదంటాడు. తిండిలేక చస్తుంటె ఓహో! ఎంత పవిత్రంగా వుపవసిస్తున్నావు! అంటాడు. రెండోవాడు సమృద్ధిలో కరువును, ఐశ్వర్యంతో దరిద్రాన్ని సృష్టిస్తాడు. నీ ఖర్మంమీది నా ఖర్మంనాది అంటాడు. ప్రజాసామాన్యం కోరేది భారీ పరిశ్రమలద్వారా సమృద్ధిగా వుత్పత్తి జరగాలి. కాని వాటిమీద నూటికి నూరు పాళ్ళు పెట్టుబాడిదారుల పెత్తనం వుండ గూడదు. వీలైతే ప్రభుత్వమే మిల్లులన్నీ కొని, యింకా పెంచి స్వయంగా నడపమనండి. అది చేయలేకపోతే కనీసం సాలుకు నూటికి రు. 3 లు చొ॥ ఆదాయం గిట్టేట్టు పెట్టుబడిదారులకు గ్యారంటీచేసి — కార్మికుల శ్రేయస్సుకోసం కనిష్ట (ఇకయింతకు తక్కువుండరాదు అనే) వేతనం నిర్ణయించమనండి. ప్రజల శ్రేయస్సు కోసం బట్టల, నూళ్ళ. గరిష్ట (ఇక యింతకు పెరగరాదనే సీలింగు రేట్లు ధరలు నిర్ణయించమనండి. ఇష్టమొచ్చినట్టు కోమకోమని కంట్రోలు తీసేసి వేటకుక్కల్లాగ వీరిని ప్రజలమీదకు వదలకూడదు. ఒక సామాన్య మిల్లు 25 లక్షలనుకుంటే దాని కామం ముకు నూటికి 3 రూ. చొ॥ సాలుకు రు. 75000 లు లాభంవస్తే చాలదా? రాకపోతే తానే యిస్తానని ప్రభుత్వాన్ని గ్యారంటీ చేయమనండి.

ఈ మిల్లుల నరికట్టడంవల్ల [కేపిటలిజం] పెట్టుబడిదారీ విధానం క్రమంగా పోతుందని పట్టాభిగారు, ప్రకాశంగారు ఒక భ్రమకల్గ చేస్తున్నారు. ఒక్క ఇద్దరుతప్ప చుట్టూ వాతావరణమంతా భారీపరిశ్రమలైనప్పుడు ఆపరిశ్రమలన్నీ వ్యక్తిలాభ సిద్ధాంతంమీద నిర్మించినపుడు పెట్టుబడిదారీ విధానంనుండి ఎట్లా తప్పించుకోగలరు? గాంధియన్‌ప్లాన్ లోనే ఎన్నో భారీపరిశ్రమలు తప్పవంటున్నారు. ఖాదీస్కీమునుబలపర్చే పట్టాభిగారెన్నో బ్యాకులు స్థాపించారు ఆంధ్రలో. ఎన్నో భీమాకంపెనీలు పెట్టేరు. పత్రికలు పుస్తకాలు ప్రకటించడానికి [మిల్లు కాగితంతోనేగాని చేతికాగితంతోగాదు సుమండీ!] లక్షల కొద్దీవాటాలు సేకరిస్తున్నారు. ఇకను ఇపుడున్న భూమిపంపకం ఎలాగున్నది? అసలు భూమిలేనివారెందరు? చాలీచాలనిభూమి 2 - 3 ఎకరాలవారెందరు? వందలు వేలు యకరాలుగల వారెందరు? ఇదంతా సమానత్వమేనా? కొంపలులేక బాధపడేవారెందరు? మేడలు, భవనాలుకలవారెందరు? సమాజజీవితంలో ఏభాగం

తీసుకున్నా అసమానత్వమే. వర్గాలున్నాయి. పెట్టుబడిదారీ విధానం సమాజంయొక్క యెముకల్లోకి, మూలుగుల్లోకి ప్రవేశించివుంచే — ఒకన్ని బిట్టల, నూలు—మిల్లుల నరికట్టి రాట్నం నిర్వహించేస్తే పెట్టుబడి దారీ విధానం పోతుందనుకోడం భ్రమ. భ్రమను తొలగించుకోకపోతే పిచ్చి.

"పెట్టుబడిదారీవిధానం—ప్రజాస్వామ్యం రెండూపరస్పరవిరుద్ధాలు కలవారికి లేనివారికి మధ్యఅగాధమే దీనికికారణం" అని అగర్వాలా గారు గాంధీయన్‌ప్లాన్‌లో వ్రాశారు. (పేజీ 6.) ఐతే ఆర్థికపునర్నిర్మాణం అంతా సామ్యవాద సిద్ధాంతాలమీద చేయమనండి. దానికంతికన్నా ఒప్పుకోరు. మరి వర్గరాహిత్యం ఎట్లాలభిస్తుంది? భారీపరిశ్రమలంతగా యిక పెంచకండి. ఐనా వర్గాలుంటే పేదవారికి భాగ్యవంతులు ధర్మకర్త లనుకోండి. ఇదిసోషలిజంగాదు కేపిటలిజంకాదు. రెంటికీ అతీతమైన గ్రామీణ సిద్ధాంతం అంటారు అగర్వాలాగారు. ఇది శాస్త్రీయమైనదని మాత్రం ఆయన బుకాయించరులెండి. "గాంధీనీత్వం అంతరాత్మ ప్రోక్తమైనది" అంటాడు. "దాని ఆదర్శం భౌతిక నిరాడంబరత్వం, ఆధ్యాత్మిక ఔన్నత్యం ఆ సిద్ధాంతం అమలు జరిగినకొద్దీ — రానురాను నిరాడంబరత్వం పెరుగుతూనే వుండాలి; ఆధ్యాత్మికౌన్నత్యం గూడా పెరుగుతూనే ఉంటుంది" అన్నారు. (అగర్వాలాగారి గాంధియన్‌ప్లాన్ పేజీ 18.)

పాపకారియైన పెట్టుబడిదారీవిధానాన్ని నాశనంచేయడానికి కాంగ్రెసు మంత్రులు ఎంత తహతహ లాడుతున్నారో చూద్దాం. జమీందారుకు ప్రభుత్వంముదరా (కంపెన్‌సేషన్) యిచ్చి జమీలు కొనాలనుకుంటారు. ముదరాఇవ్వనఖ్ఖర్లేదని రైతులంటే తప్పదంటున్నారు. ఇదేనా పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేసేపద్ధతి? ప్రకాశంగారు మంత్రిఅయి 6 మాసాలైందో లేదో! చూడండి. ఎన్నిచోట్ల లాఠీచార్జీలు, 144 సెక్షనులు, తుపాకీ కాల్పులు జరిగేయో! ఎవరిమీద? దొంగమార్కెటు దార్లమీద? హెచ్చు ధరలకోసం సరుకులుపాతరేసి దొంగమార్కెటులో అమ్మేవారిమీదగాదు సుమా! పాతరేసినవారిని బుజ్జగించి బోనసులిచ్చారు. ఈ తుపాకీ కాల్పులు కార్మికులమీద! నెలకు రు 10 జీతగాళ్ళు వీధులూడ్చేవారిమీద! ఫ్యాక్టరీలో రోజుకు 0—6—0 కూలివాని మీద! నెలకు రు15ల రైల్వేకూలీ మీద! ఎందుకు? ఆ కూలిచాలదన్నందుకు? ఇదేనా పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేసేపద్ధతి. అంతరాత్మ ప్రోక్తమైన ఆధ్యాత్మిక సిద్ధాంతాలను

ఎంతచక్కగా అమలుపరుస్తున్నారండి! రాజగోపాలాచారిగారు మంత్రి అయి 2 మాసాలయిందో లేదో—సరుకులమీద కంట్రోలు తీసేశారు. ఎవరిలాభంకోసం? వర్తకులకు ఇబ్బందిగా వుందిట! పర్యవసానం 0—0—9 పెన్సులు 0—4—0 ఐంది. దీనితో వారిఇబ్బంది పోయింది పాపం! భలే! పెట్టుబడిదారీ విధానాన్ని చక్కగా రద్దుచేస్తున్నారు. వర్తకులకోసం కంట్రోళ్ళు తీసేస్తున్నారు. ఇక కార్మికుల కోసమో! సమ్మె చేయకూడదని నిర్బంధశాసనాలు పెట్టారు. సమ్మె హక్కు లేకండాచేశారు కూలిచాలకపోతే పిటిషన్ పెట్టుకో. అంతే ఆపైన నీవు ఏంచేసినా తుపాకికి గురౌతావు సుమా అంటున్నారు. దీనివల్లగాని పెట్టుబడిదారీ విధానం నశించదని వారిఅంతరాత్మలు చెపుతున్నాయి పాపం!

కాంగ్రెస్ పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేసి సోషలిజం స్థాపిస్తుందని రాజకీయ జ్ఞానం వున్న ఎవరికీ భ్రాంతిలేదు. కాంగ్రెసే కరాచీ తీర్మానంలో స్వరాజ్యంలో "వ్యక్తిగత ఆస్తి" కాపాడబడునని స్పష్టంగా చెప్పుకుంది.

## "ఆంధ్ర నాయకుడు ఆచార్య రంగా"

ఏ "రంగా" గారిలాంటివారో రైతు - కూలీ ప్రజారాజ్యమని ఉపన్యాసాలు దంచినా బాధ్యతగల కాంగ్రెసుపెద్దనాయకులెవరూ ఈభూములు ఫ్యాక్టరీలు, బ్యాంకులు, భవనాలు వ్యక్తులనుండి లాక్కొని సోషలిజం స్థాపిస్తామని అనడంగాని, తీర్మానం చేయడంగానిజరగలేదు. 17-12-38 నేషనల్ ప్లానింగు కమిషన్ బొంబాయి సమావేశంలో అధ్యక్షుడు జవహర్‌లాల్ — కాంగ్రెసు సోషలిజంను అంగీకరించలేదని ఖచ్చితంగా చెప్పాడు. (N. P. C. Hand Book) చూడండి. కాంగ్రెసు తీర్మానాలు అర్థంకానివారు ఆచార్య రంగాగారి అట్టహాసాల వలలో పడవచ్చు.

దేశం మొత్తంమీద రంగాగారి మాటలంతలెక్కచేయకపోయినా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాల్లో ఆయనకొక స్థానమున్నది. బిర్లాగారి కెన్ని మిల్లులున్నాయో ఈయన చేతిలో అన్ని సంఘాలున్నాయి. ఈయన కూడా మిల్లుల నివారణ విధానాన్ని బలపరుస్తున్నాడు. ఆంధ్రాకాంగ్రెస్ అధ్యక్షుడు, చెన్నరాష్ట్ర చేనేతకాంగ్రెసధ్యక్షుడు. ఆంధ్రలో ప్రధాన వస్త్రోత్పత్తిదారులైన చేనేత పారిశ్రామికుల ఉద్యమంతో ఈయనకు చాలా కాలంనుండి సంబంధంవుంది. ఈయన 1936 నుండీ చెపుతూఉండే

దేమిటి? కేవలం రాటంవల్ల చేనేతపరిశ్రమ బాగుపడదు. (అప్పుడూ ఈయన కాంగ్రెస్‌వాదే).... ఇండియన్ మిల్లు యజమానుల లాభం కోసం బ్రిటన్‌నుండి దిగుమతి అయ్యే సన్నసూలుమీద పన్ను వేయడం చేనేతపరిశ్రమకు నష్టం (అప్పుడూ ఈయన జాతీయవాదే)....మిల్లు నూలు ధరలు. ప్రత్తిధరలను బట్టి తగ్గించకపోతే చేనేతపరిశ్రమ దెబ్బ తింటుంది. (ఇదిగూడా కుటీరపరిశ్రమ లాభంకోసం చెప్పిందే)....చేనేత పారిశ్రామికులింకా ఎన్నాళ్లు ఈ గోతిమగ్గాల్లో మగ్గిపోతారు? ఎలక్ట్రిసిటీ గ్రామగ్రామానికి రావాలి. పవర్ మగ్గాలు పెట్టుకోవాలి. (వడుకునూలు నేయడానికి కాదు సుమండీ!).... "మీరంతా (చేనేతపారిశ్రామికులు) కడుపునిండా భోజనం లేకపోయినా పెద్దపెద్ద విభూతిబొట్లు, పంగనామాలు పెట్టారు. తక్కువ ఆదాయంగల ఈవృత్తిలో ఉన్నంతకాలం బొట్టులేగతి. భోజనం సూన్యం. ఆర్థికంగా అభివృద్ధికొచ్చి మన పిల్ల పిల్లతరాలవారంతా విద్యతో, విజ్ఞానంతో సుఖంగా వెలిపే సోషలిస్టు సమాజం ధనికపేద వర్గములు లేని సమాజం మనకు ప్రధానం. వృత్తి ఏదైతేనేమి? అందులో ఎన్నిమార్పులు వస్తేనేం?" ఇదంతా ఆరోజుల్లో వేసినప్లేటు. 1944 తర్వాత తన అధ్యక్షతక్రింద వుండే లక్షలాది సభ్యత్వంగల పెద్ద ఆంధ్రరైతుసంఘం — ఈ నాయకత్వాన్ని తొలగించుకున్నతర్వాత— మళ్ళీ వార్ధావెళ్ళి మతంలో మార్పులు చేసుకుంటేనేగాని వీలులేకపోయింది. పాపం! ఆంధ్రరాజకీయాల్లో ఏదోరకమైన ప్రత్యేకస్థానం నిలబెట్టుకోవాలంటే తప్పదు! మార్చుకోవలసివస్తే మార్చుకున్నారు మతం! ఈమార్పు బలవంతాన వచ్చిందేగాబట్టి పాత వాసన త్వరగావదలదు. అందుచేతనే 1945 లో ఆంధ్రచేనేత మహాసభ (మండపేటలో) జరిగినపుడు ఒక ప్రక్కన ఖద్దరు తీర్మానం, రెండో ప్రక్క సన్ననూలు విదేశాలనుంచి తెప్పించి యిమ్మని తీర్మానం. రెండూపెట్టించేరు ఆచార్యులవార్ల శిష్యుల చేత. ఇది పరస్పరవిరుద్ధం కాదా? అని అడుగుతారేమో? ఈయనపట్ల ఆ ప్రశ్న ఎప్పుడూ వేయవద్దు. ప్రశ్నలు వేయకపోవడం — అడిగేవానికి, చెప్పేవానికి గూడా ఆరోగ్యమే?

ఇక రైతుకూలీరాజ్యం: పేదవాళ్ళమీద ప్రేమ యీయనకెంత ఉన్నదో చూద్దాం. 1945 లో బట్టలు ధరలు 8 రెట్లు పెరిగి పేదస్త్రీలు కొనుక్కోలేక బాధపడుతుంటే, ఇక గుడ్డలులేక కూలిపనికిపోతేనేగాని గంజినీళ్ళులేని స్త్రీలుగూడా కూలికి పోవడం లేదని, ఆత్మహత్యలు

చేసుకుంటున్నారని వార్తలు వింటున్నప్పుడు, ఈయన ఏంచేసేరు? చేనేతబట్టల మీద కంట్రోలు పెడతామని ప్రభుత్వం నిర్ణయించడానికి నాగపూర్‌లో సమావేశ మైతే - వర్తకులందరివెనకాల ఈయనగూడా నాగపూర్ వెళ్ళి - కంట్రోలు పెట్టవద్దని మహాగోలచేసి వచ్చేరు. మొన్న మొన్న "యుద్ధం అయిపోయింది గనుక యిక మిల్లునూలుమీద మాత్రం కంట్రోలెందు" కని శెలవిచ్చారు. బట్టల కరువులో బట్టల కంట్రోలక్కర లేదనడం రైతుకూలీ ప్రజారాజ్యానికి దారితీస్తుంది కాబోలు! అల్లాగైతేనే గావి పెట్టుబడిదారీ విధానం నశించదు కాబోలు! ఆయన మాటలకర్థం మామూలు నిఘంటువులలో దొరకదు. ఆయన స్వంత నిఘంటువులో బోధపడుతుంది లెండి!

ఇపుడత్యంత గాంధేయులు అయిపోయినారు ఆచార్యులువారు. బట్టలు నేయడానికి మిల్లునూలు కోరడం చేనేతవారికి సిగ్గుచేటట! రాటం మీద వడుక్కుని మగ్గంమీద నేసుకోమంటున్నారు. చేనేతవారిలో ఇది ప్రచారంచేయడానికి, ఉత్సాహపర్చడానికి పాత పురాణాలు దులిపి — చూడండి! మన ధక్కామజ్లిన్‌ల ప్రతిభ! లండన్‌రాణి, రోమన్‌రాజు, మీపూర్వుల నైపుణ్యానికి మంగళహారతులిచ్చారు. ఔరంగజేబు కూతురు 7 పొరలచీరకట్టి దర్బారుకొస్తే దిసమొలతో వచ్చిందా అన్నంతసన్నంగా వుండట ఆచీర. అగ్గి పెట్లో, ఉంగరంలో చీరంతా యిమిడేదట. ఆహా! ఒళ్ళు పరవశమవడంలేదా మీపూర్వులను తల్చుకుంటే! మీరింత గొప్పవారైవుండి మిల్లు నూలు కోసం పాకులాడ్డం సిగ్గుగాదా" — అంటున్నారు.

1936 చేనేత మీటింగుల్లో ప్రజలను ముందుకు చూడమనేవారు. సోషలిస్టు సమాజం. కనిముట్లల్లో మార్పు కావాలనేవారు. 1946 లో వెనకచూపు చూడమంటున్నారు. మారడం మంచిది కాదంటున్నారు. పాతదాన్ని పునఃస్థాపించాలట.

నిజమే: ప్రాచీన భారత నాగరికతలో ఒక ప్రత్యేకత వస్త్రపరిశ్రమే. ఇతరదేశాల్లో బట్టలంటే ఏమిటో ఎరగని రోజుల్లో మనం పత్తి పంట, రాటం, మగ్గం, అన్నీ కనిపెట్టేము. 4000 సంవత్సరాల క్రితం ఋగ్వేదంలోకూడ, అప్పటికే మనకు వస్త్రపరిశ్రమున్నట్లు ఉదాహరణలున్నాయి. ప్రాచీన కాలములో భారత నాగరికత ఉన్నత స్థానములో

ఉండేది. ఐతే ఇంతగొప్పవాళ్ళం, యిపుడు మనం యింత దరిద్రంగా ఉండటమేమి? మన తర్వాత నాగరికతను నేర్చుకున్న ఇంగ్లండు మొదలైన దేశాలు మనకంటె ఎక్కువైశ్వర్యంతో తులతూగుతుండట మేమి? మన నలభై కోట్ల ప్రజల దామాషా దినవారీ ఆదాయం 0-3-6 అయితే. ఇంగ్లీషువాళ్ళదినవారీదామాషాదాయం రు3-8-0 ఉండడమేమి? ఇంగ్లండు కంటె ఆలస్యంగా అభివృద్ధి మార్గాన పడ్డ అమెరికాలో రు 4-8-0 ఉండడమేమి? ఆదాయంలో వాళ్ళది గొప్ప అయినా ఆధ్యాత్మికంలో మనదే గొప్పని చౌకబారు సమాధానం చెప్పి తప్పించుకొనిపోవడం గంజాయి వేదాంతులకు సులభమే. ఆ ఆధ్యాత్మికాన్ని చర్చించాలంటే లదొక ప్రత్యేక పుస్తకమే అవుతుంది. ఈ వ్యాసంలో ఆచర్చకుతావులేదు. మనకు కావలసిన విషయమేమంటే ఒక దేశం చరిత్ర పూర్వకాలంలో ఔన్నత్యంగా వున్నంతమాత్రంచేత, ఇతరదేశాల కన్నా మిన్నయి ఒకప్పుడున్నంత మాత్రంచేత, ఎల్లకాలం అలావుండలేదు. వుండదు. అప్పుడు చేతిపరిశ్రమలు మనకేతెల్సు వారికితెలియవు. అపుడు వారికంటె మనమభివృద్ధిలోవున్నాము. తర్వాత మిల్లు పరిశ్రమ వచ్చి" ఉత్పత్తిశక్తి" నెక్కువచేసింది. ఈపెద్దఉత్పత్తిశక్తి యేదేశంలో పెరిగితే ఆదేశం, మిగతా దేశాలకన్న ముందుకు పోతుంది. రేపు "ఆటమిక్" శక్తిని పరిశ్రమలకుపయోగించడం కనిపెట్టితే ఆపనిముందే దేశంచేస్తుందో అది యింకా ముందుకు పోతుంది మిగిలిన దేశాలనితల తన్ని. ఈ ఆటమిక్ శక్తి పరిశోధనకు నెహ్రూ ప్రభుత్వంగూడ ధనాన్ని మొన్ననే గ్రాంటుచేసిందే. ఎందుకు? ప్రకాశంగారి రంగాగారి, గ్రామ స్వయంపోషకత్వ సిద్ధాంతానికుపయోగపడుతుందనా? కాదు. ముమ్మాటికీకాదు. భారతదేశంలోని 40 కోట్లప్రజలు భారీ పరిశ్రమలతో తులతూగుతూ భవిష్యత్‌లో ఒక పారిశ్రామిక సమాజంగా [ Industrial Community ] అభివృద్ధి పొందాలనే.

....రష్యాలో రంగు రంగులనూలి పండిస్తున్నారు. అహమదాబాద్ మిల్లు వారదికొని చవుకగా బట్టనుత్పత్తిచేస్తే పోటీకి బాగావిలబడగలమని ఆలోచిస్తున్నారట. అపుడు రంగుల కార్ఖానాలెగిరిపోతాయి. ఎగిరిపోతే ఎగిరిపోనీయండి, ఆకార్మికులందర్నీ మోటారు కార్ఖానాల్లో పెట్టి కార్ల ఉత్పత్తిని పెంచండి.

## ఆంధ్రలో వస్త్రోత్పత్తి పరిణామం.

ఆంధ్రలో బట్టలమిల్లులులేవు. కాని వస్త్రోత్పత్తి జరుగుతూంది చేనేతమగ్గాలమీద. ప్రస్తుతం 2 లక్షలదాకా వున్నాయి. వీటికి పూర్తిగా మిల్లునూలిస్తే సాలుకు 25 కోట్ల గజాల బట్ట తయారుచేస్తాయి. లేక పోవడంవల్ల 6 కోట్ల గజాల బట్ట నేస్తున్నారు. వీటిలో 3 వేలు ఖద్దరు నేసేవి పోతే మిగతావన్నీ మిల్లునూలే నేస్తున్నాయి. వీటిని తాడులాగే "మరమగ్గా" లంటారు.

కాని 50 ఏండ్ల క్రిందట ఈ "మరమగ్గాలు" మన కెక్కడా లేనే లేవు. "చేత్తో నాడివిసిరే మరమగ్గా" లే వుండేవి. దీనిమీద రోజుకు 8 గజాలు నేస్తే దానిమీద 3 గజాలే. ఇంకా వెనక్కువెళ్ళి 125 సం॥ రాల క్రిందట జూస్తే మిల్లునూలే లేదీ మగ్గాలకు. అంతా వడుకునూలే. ఆనాడు గ్రామ స్వయంపోషకం కొంతవరకు అమలులో వుండేది. రైతు లకు బట్ట కావాలంటే వారింట్లో స్వయంగా ఆడవారు వడుక్కునేవారు. వడికిననూలు ఎంతవుంటే అంతబట్టే వారికి గతి. పెళ్ళిళ్ళకు ఎక్కువ బట్టలు కావాలంటే 6 నెలలు ముందునుంచీ రాత్రింబగళ్ళు వడికి వడికి ఆ నూలంతా చేనేతపనివాని కిస్తే బట్టనేసి యిచ్చేవాడు. గ్రామంలో అమ్మలక్కలంతా వడికిన నూలుతో చేనేతవానికి సాలుపొడుగునా చేతి నిండా పనిలేకపోతే — ఏ వ్యవసాయ కూలిపనో మధ్యమధ్య చేసుకొని బ్రతికేవాడు. రైళ్ళులేవు. మిల్లులులేవు. 500 జనాభా గ్రామం వుంటే 5 సాలె కుటుంబాలుండేవి. ఎంతో శ్రీమంతులకుతప్ప పంచలు, కండు వాలు, జతలు జతలుగా వుండేవికావు. నూటికి 90 మంది రోజూ గోచి తోనే కాలక్షేపం. పండక్కిమాత్రమే పంచ. ఉన్నజనాభాకు ఏ వృత్తుల వారెన్ని కుటుంబాలవసరమో అన్నే ఆ గ్రామంలో వుంటూవుండేవి అంతా ఒక గిరిగీసుకొని ఆ గిరిలోనే బ్రతికేవారు మిగతా ప్రపంచంతో సంబంధం లేదు. తర్వాత మిల్లునూలు, రైళ్ళు వచ్చేయి. బేళ్ళకొద్దీ నూలు రైళ్ళల్లోవచ్చి రాసులక్రింద పడ్తున్నాయి చాదస్తం వదలిపెట్టి వడుకునూలును మానేసి మిల్లునూలు నేస్తే — సాలు పొడుగునా నేత పని వుంటుంది మధ్య మధ్య వ్యవసాయ కూలిపని చేయనక్కర లేదు. ఆ బట్ట మళ్ళీ దూరానికి పట్టుకెళ్ళి షావుకార్లు వాగా లాభానికి అమ్మ కోడానికి రైళ్ళున్నాయి. చేనేతవాళ్ళు నూలు కొనుక్కోలేకపోతే పెట్టు

బడి పెట్టి బట్టల నూలు, వ్యాపారం చేసే ఒక (మాస్టర్ వీవర్) వర్గం ఏర్పడింది. ఇక ఈ పనివాడికి చింతలేదు. మెల్లగా స్వయంపోషకంగా వుండే కుగ్రామ గిరి నుండి తప్పించుకొని మిల్లునూలు షాహుకారున్న గ్రామానికి చేరుకున్నాడు. దానిలో ఇద్దరి పీడా వదిలించనుకున్నారు రైతులు, నేతవారుగూడాను. రైతుల పీడ ఎట్లా వదిలింది? అదివరకు అల్లుడికి పండక్కి చాపు యివ్వాలంటే అత్తగారు నెల్లాళ్ళు నిద్రమాని చచ్చినట్టు వడికితీరవలసిందే. ఇపుడా శ్రమ లేదు. బజారుకు వెళ్ళితే ఒక్క గంటలో కొని తెచ్చికోవచ్చు. పైగా నాజూకుగా వుంటుందీ మిల్లు నూలు చాపు. అల్లుడు సంతోషిస్తాడు. ఇంకా పైమాట శ్రమ తప్పింది. చవుగ్గా వస్తుంది. ఇకను నేతపనివాని పీడ ఎలా వదిలింది? ఉసూరు మంటూ ఎవరు నూలు వడికితెస్తారా? అని పడగాపులుపడి కూర్చో నక్కరలేదు. ఒక నెలలో పని వుందనీ, ఒక నెలలో లేదనీ భయం లేదు. చేసుకుంటే ఎప్పుడూ వుంటుంది మిల్లునూలు. ఎక్కువ గజాలు సులభంగా నేసేయవచ్చు. కొంప కట్టుకోడానికీ, పెళ్ళి చేసుకోడానికీ అప్పు గావాలంటే పూర్వం పుట్టేదిగాదు. ఇతనవసరం రైతుకు ఒక చాపు, చీర నేయించుకోవడంతో తీరిపోయేది పూర్వం. అప్పిస్తే ఎల్లా వస్తుంది? మాష్టరువీవరు బయలుదేరాక సాలుపోడుగునా వీరిద్దరికి "దండా గొండెం". అతను నేయించుకుంటేనేగాని అతనికి వర్తకం లేదు. ఇతను నేస్తేనేగాని ఇతనికి వృత్తిలేదు. ఆ సంబంధాల్లో అప్పు లివ్వడానికి, పుచ్చుకోడానికి సావకాశం కలిగింది. మిల్లునూలు స్వీకరించడం వల్లనే ఒక మైలురాయి దాటి చేనేతవారంతా ముందుకొచ్చారు. ఈ చేనేత కాంగ్రెస్ ప్రగడ కోటయ్య, రంగాగార్లు అపుడుండి అడ్డు పడితే ఆగలేదు. మిల్లునూలు స్వీకరించకపోతే చేనేతజాతి క్షీణించి వుండును. రాటపునూలు పోయి మిల్లునూలు రావడంవల్ల చేనేత పరిశ్రమ ఒక్కదానిలోనే మార్పు వచ్చిందా? కాదు. సమాజంలోనే మార్పు వచ్చింది. ఎట్లా? అదివరకు ఒకొక్క గ్రామానికి ఐదేసి, ఆరేసి చేనేతకుటుంబాలుండేవి. ఇపుడు కొన్ని గ్రామాల్లో వందలు వేలు చేనేతకుటుంబాలు చేరుకున్నాయి. మరికొన్ని గ్రామాల్లో అసలే ఆకుటుంబాలు లేకుండా పోయాయి. రైలుకు దూరంగా ఉన్న ప్రాంతాల్లో త్వరగా మార్పురాలేదు. కాని తర్వాత తర్వాత అక్కడివారుగూడా ఇక్కడికి వలస వచ్చేశారు. గ్రామం చుట్టూవున్న 'గిరిగీత' తుడుచుకు పోయింది.

స్వయంపోషక సిద్ధాంతం అదృశ్యమైంది. ఇపుడు మళ్ళీ ప్రకాశంగారు తేవాలంటే చేనేతవారి జనాభాను గ్రామగ్రామానికి పునర్విభాగం చేయాలి. ఒక్క సేలం పట్నంలో 30 వేల మగ్గాలున్నాయిపుడు. జిన్నాగారు పాకిస్థాన్‌కోసం జనాభాను మార్చమన్నట్టు ప్రకాశంగారు గ్రామస్థావ్ కోసం మార్చాలి.

తర్వాత మిల్లునూలు వచ్చిన 75 ఏండ్లకు మరోపెద్ద మార్పు వచ్చింది మన వస్త్రపరిశ్రమలో. "చేతినాడిమగ్గం" పోయి— "త్రాడులాగే మరమగ్గం" వచ్చింది. ఇదెలా ప్రచారంలోకి వచ్చింది? అవి బ్రాహ్మణేతర ఉద్యమదినాలు. ఆయవారం, అర్చకత్వం, కరణీకాలు, చిన్న ఉద్యోగాలు, పెద్దఉద్యోగాలు, అగ్రహారాలు అన్నీ బ్రాహ్మలకేనా? ప్లీడర్లు, డాక్టర్లు యింజినీర్లు అందరూ బ్రాహ్మలేనా? పరీక్షల్లో వచ్చిన మార్కులనుబట్టి ఉద్యోగాలిస్తే అన్నీ బ్రాహ్మలే కొట్టేస్తున్నారు. మిగతావారంతా ఏంగాను? అందుచేత జనాభానుబట్టి బ్రాహ్మణేతరులకిన్ని ఉద్యోగాలని ప్రత్యేకించమన్నవాదన బయలుదేరింది. ఇదిసులభంగా నెగ్గదుగదా. పెద్ద ఉద్యమంలేకుండా ప్రభుత్వం కదలేదశ రాదుగదా! బ్రాహ్మణద్వేష ఉద్యమం లేచింది. శూద్రులనబడే అనేక కులాలవారు జంధ్యాలు కొత్తగా వేసారు. మంత్రాలు నేర్చుకున్నారు. పెళ్ళిళ్ళు బ్రాహల్ని పిల్వకుండానే చేసుకుంటున్నారు స్వంతదేవాలయాలు కట్టించుకొని స్వంత అర్చకత్వాలు చేసుకుంటున్నారు. ఉద్యమం ఒకస్థాయిలో కివచ్చేక కమ్యూనల్ రేషియో ప్రకారం అనగా కులాల జనాభాలను బట్టి ప్రభుత్వోద్యోగాలు నిర్ణయించేరు. దీనినాయకుల్లో సర్ పిట్టి త్యాగరాయ శెట్టిగారొకరు. ఆయన చేనేత పారిశ్రామిక కులానికి సంబంధించినవాడు. జస్టిస్‌పార్టీ పితామహుడు అపుడు జస్టిస్‌పార్టీ మంత్రి వర్గంలో వుంది. ఈయనకు బ్రాహ్మణద్వేషమేగాని బ్రిటిష్ద్వేషంలేదు. అందుచేత దేశాభిమానంకన్నా కులాభిమానం ఎక్కువ. తనజాతిని అభివృద్ధికి తేవాలంటే మంత్రాలు నేర్పితే చాలదు. ఒకరిద్దరికి ఉద్యోగాలిస్తే చాలదు అందరికీ ఉద్యోగాలివ్వ లేరుగదా! చేనేవృత్తిలో ఎక్కువ గిట్టుబాటయ్యే మార్పు ప్రచారంలోకి తీసుకురావాలనుకున్నారు. అప్పటికే తాడులాగే మరమగ్గం కనిపెట్టబడింది మనదేశంలో ప్రచారంలోలేదు. ప్రభుత్వంద్వారా దాన్ని తెప్పించి నేర్పడానికి మద్రాస్‌లో చేనేతస్కూలుపెట్టి (ఆస్కూలిప్పటికీ వుంది) అందులో తరిఫీదైనవారిని ప్రతిజిల్లాకు ప్రచారకులుగాపంపి

ఎగ్జిబిషన్‌లు (ప్రదర్శనాలు) పెట్టిసభల్లో ప్రదర్శించి బాగా ప్రచారంచేసేరు. స్వల్పకాలంలోనే రాష్ట్రమంతా అనగా 10 ఏళ్ళల్లో కొత్తమగ్గం వ్యాపించింది. దీనితో రెండవమైలురాయి దాటేడు. చేనేత పారిశ్రామికుడు మనరాష్ట్రంలోని వస్త్ర ఉత్పత్తిదారుడు. ఐతే మనకు కావలసిన విషయమేమంటే, 60 ఏళ్ళ నుండి ఖద్దరు ప్రచారంచేస్తే రాష్ట్రంలో నూటికి 2 మగ్గాలు కూడా మారలేేమి? మిల్లునూలు వచ్చినపుడుగాని, మరమగ్గం వచ్చినపుడుగాని స్వల్పకాలంలోనే మగ్గాలన్నీ మారిపోయాయేమి?

మొదటి మార్పు (ఖాదీ వైపుకు) కాలచక్రాన్ని వెనక్కి త్రిప్పేది. ఎంత పెద్దసంస్థ (కాంగ్రెసు), ఎంత అవతార పురుషుడు (గాంధీ మహాత్ముడు) 60 ఏళ్ళ నుండి తల బద్దలుకొట్టుకున్నా ఈ దిక్కుమాలిన ప్రజలికి బుద్ధిలేదు. ఖద్దరు ధారులు కాలేదు! ఒకవేళ ఖద్దరుకు రాజకీయ అధికారంవస్తే వేషానికి ఒక చొక్కా ఖద్దరు తొడుగుతున్నారేగాని హృదయపూర్వకంగా దీక్షబూనడంలేదు. సరే చేనేత వారిలో చేనేత కాంగ్రెసుకు కూడా తప్పనిసరివచ్చి బడానాయకులు వడుకు నూలు నేయమంటున్నారేగాని, ఛోటానాయకులు "మేము మాత్రం మిల్లు నూలు వద్దంటున్నామా"అని తలతిరుగుడు సమాధానంచెప్పి తప్పించుకుంటున్నారు. చేమగ్గాలన్నీ చేరాటాలమీదనే ఆధారపడాలని గట్టిగాచెప్పడానికి భయపడుతున్నారు. ఎదురీత కష్టంగా వుంది పాపం!

కాని రెండోమార్పు (మిల్లునూలు వైపుకు–మరమగ్గం వైపుకు) సులభంగానే ఆయాదశల్లో వ్యాపించింది. దాన్ని ప్రచారం చేయడానికి ఏపెద్ద రాజకీయ సంస్థాపూనుకోలేదు. ఏఅవతారపురుషుడూ ప్రచారంచేయలేదు. అతిస్వల్పకాలంలో కొత్తమార్పులను పరిశ్రమ జీర్ణించేసుకుంది. కారణం? ఒకవైపు ప్రజలకి చౌకగా బట్టనారికే సావకాశం, రెండవవైపున ఉత్పత్తిదారునికి సులభంగా తయారయ్యేపద్ధతి–ఈ రెంటివల్ల కాలచక్రం ముందుకుపోవడం సులభమైంది. ఖద్దరులో, కొనేవారికి, నాజూకులేకపోయినా ఖరీదెక్కువ. నేసేవారికి శ్రమఎక్కువ మజూరితక్కువ. దీన్నెంత ప్రచారంచేసినా ఎదురీతేఐంది? ఎంతసేపు ఈదినా, ఎంత అలసినా బయలుదేరినచోటే వుండిపోతావుంది.

ప్రపంచం ముందుకు నడుస్తుంటే రంగాగారు భౌతికవాదానికి బదులు ఆధ్యాత్మికవాదం తెచ్చినా, చారిత్రకవాదం విడచి అవకాశవాదం

తెచ్చినా మహాజగన్నాథ రథం ఆగదు. వెనక్కితిరగదు. ఎద్దుబండికి జట్కా పోటీఅనీ, జట్కాకు బస్‌పోటీఅనీ. బస్‌కు రైలుకు విమానం పోటీఅనీ, ఆముదం దీపానికి కిరసనాయిలుదీపం, ఎలక్ట్రిసిటీ పోటీఅనీ, కంకరకూలీకి సిమెంటురోడ్డు పోటీఅని, తోలుబొమ్మలాటకు సినిమా పోటీఅనీ, తిరపతికొండకు రోడ్డువేస్తే డోలీవాళ్ళకి పోటీఅనీ, వాదించి దేశాన్ని ముందుకు పోకుండా ఆపజూచినా ఆపలేరు. ఆగదు.

ఆంధ్రలో వస్త్రపరిశ్రమ రెండవ మైలురాయిదాటి, ఇప్పుడు 3 వ మైలు రాయి దగ్గర కొచ్చింది. తుంగభద్రలో ప్రాజెక్టు కట్టున్నారు రామపాదసాగరప్రాజెక్టు ఒకటి కడుతున్నారు. కొత్తగా కోటియకరాలను మాగాణీచేస్తాయి. అంతేగాదు వీటిలో విద్యుఛ్ఛక్తి (ఎలక్ట్రిసిటీ) పుడుతుంది. అదిచాలా చౌకగా గిట్టుతుంది. పొలాల్లో ఎడ్లతో నీరు తోడ్డం మాని ఎలక్ట్రిసిటీద్వారా తోడమంటున్నారు. కిర్సనాయిలు దీపాలకన్నా ఎలక్ట్రిక్‌దీపాలుచౌక, సౌఖ్యం. వంటకు కట్టె పుల్లలుకన్న ఎలక్ట్రిసిటీ చౌక. సౌఖ్యం. చేనేత పారిశ్రామికుని యింటికికూడ వచ్చి ఈ ఎలక్ట్రిసిటీ తలుపుతట్టుతుంది. "నీమగ్గానికినన్ను తగిలించు. నీకుశ్రమలేకుండా చౌకగా ఇదివరకుకన్న ఎక్కువగా బట్టనేసిపెడ్తాను" అంటుంది. చేమగ్గాలు పవరుమగ్గాలుగా మారడమే ఆంధ్రవస్త్రోత్పత్తిలో 3 వపెద్దమార్పు. చారిత్రకమైనమార్పు. ఈసమయంలో మరకదుళ్ళు పవర్‌మగ్గాలు కేంద్ర ప్రభుత్వం యిస్తామంటున్నా ప్రకాశంగారు వద్దంటున్నారు. మారాష్ట్రం మడికట్టుకుని కూర్చుంటుందంటున్నారు. గ్రామాల్లో నిరుద్యోగులకు పనికల్పించడానికియంత్రపరిశ్రమను అరికట్టకతప్పదంటున్నారు. సైన్సు (శాస్త్రం) అభివృద్ధికొచ్చి ఏవ్యక్తీ దరిద్రంగా వుండనక్కరలేని మార్గం చూపుతూంది. ప్రజాభివృద్ధికన్న పెట్టుబడిదారీసిద్ధాంతం వ్యక్తిగత లాభసిద్ధాంతం, ఉత్కృష్టమైనదనిచెప్పి ప్రజల్ని పెడమార్గాల పెడ్తున్నారు.

మన దేశములో నిరుద్యోగము పరిశ్రమలు అభివృద్ధిచెందడం వల్ల వచ్చిందనడం పొరబాటు. మన ఆంధ్రదేశం పారిశ్రామికంగా చాలా వెనుకబడియుంది. బొంబాయి మొదలయినవి మనకంటె పారిశ్రామికంగా అభివృద్ధి పొందాయి. అక్కడకంటే నిరుద్యోగము తక్కువగా ఉండాలిగదా, కాని వాస్తవపరిస్థితులు ఏమిటి ?

ఆంధ్రదేశంలో పట్టుమని పది పరిశ్రమలే లేవు మన ఆంధ్రుల స్థితి చూడండి. పొట్టచేతబట్టుకొని పరిశ్రమలు ఉన్నచోటికి పరుగులెత్త

వలసి వస్తోంది. బొంబాయిలో 1 లక్ష జనాభావరకు మన ఆంధ్రులు ఉన్నారు. ఏకొద్దిమంది మినహా వీరందరూ కార్మికులుగానే జీవనం చేస్తున్నారు మద్రాసులో రిక్షాబండ్లవాండ్లు ఎక్కువ ఆంధ్రులే. మన ఆంధ్రులు తిండికోసం, కలకత్తా వరకూ వెళ్ళారు. ఇంతేకాదు. ఇతర రాష్ట్రాలు వెళ్ళడమేకాదు. ఇతర దేశాలకుకూడా పోతున్నారు. కోస్తా ప్రాంతాల్లోనివారు రంగూను ప్రతిసంవత్సరం వెళ్ళి పొట్ట పోసుకుంటున్నారు. ఇంకా దక్షిణాఫ్రికా నేటాలు మొదలయిన ప్రాంతాల్లో కూలిచేసుకు బ్రతుకుతున్నారు.

ఇంటివద్ద దుర్భరదారిద్ర్యం. ఎలాగయినా పొట్ట పోసుకోవాలి. తెలుగుదేశంలో కూలీ చేయించుకునేవారులేరు. పరిశ్రమలుంటేగదా కార్మికులను పెట్టుకోడానికి. పనికోసం మాతృభూమిని వదలి, పరిశ్రమలు ఉన్న ప్రాంతాలకు పోతున్నారు. పారిశ్రామికంగా వృద్ధి అయిన ప్రాంతాల్లో మన ఆంధ్రులులేని పట్టణంలేనేలేదు. అచ్చట అంతా కూలీలుగానే బ్రతుకుతున్నారు.

తమ మాతృభూమిని వదలి యిలా పోవడానికి మన దేశంలో పరిశ్రమలు ఎక్కువ అని ఎవ్వరూ అనరుగదా. మనదేశంలోనే పరిశ్రమలు పెరిగినట్టయితే ఇలా వలసపోయే గతి పట్టేదికాదే. మన దారిద్ర్యానికి కారణం పరిశ్రమలులేకపోవడమేగాని, ఎక్కువ అవడంకాదు.

ఆంధ్రలో ప్రాజెక్టులుకట్టి ఎలక్ట్రిసిటీ తీయడంవల్ల, కోటియకరాలు కొత్తగా వ్యవసాయంలోకి తేవడంవల్ల, కనీసం ప్రతిసంవత్సరం ఈ200 కోట్లరూపాయలు ఇక్కడాదాయంపెరుగుతుంది. ఈఆదాయంతోఆమెరికా బట్టలు తెప్పించుకోమంటారా? ఆదాయం పెరిగినా గోచీతోనే కాలక్షేపం చేయమంటారా? తూర్పు గోదావరి ఏజన్సీ సమీపంలో రాక్షస బొగ్గు గనులున్నాయనీ, వెయ్యి మంది రోజూపనిచేస్తే 200 ఏళ్ళదాకా గనులు తరగవనీ అంటున్నారు. విశాఖజిల్లాలో గాజుఫ్యాక్టరీలకు సావకాశముందట. బెజవాడలో రైల్వే ప్లేట్లు తయారుచేసే యంత్రాగారం కట్టాలన్నారు. తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో కిర్సనాయిలు గనులున్నాయట ఆంధ్రలో ఏఏ నిధి నిక్షేపాలున్నాయో పరిశోధించి సమగ్రమైనరిపోర్టు తయారుచేయడానికి ప్రకాశంగారు పూనుకుంటే బాగుండును. ఇవన్నీ తెల్సుకోవాలి. ఇవన్నీ అమలుపరిస్తే తక్కువాదాయంతో పిడకలు చేసే మనుష్యులను బయటకు లాగవద్దూ? ఈమధ్య ఢిల్లీగవర్నమెంటుకు

కొత్తమిల్లులు పెట్టుకుంటామని మొత్తం 3000 పిటిషనులు వచ్చినాయని ప్రకటించింది. అందులో 650 తప్ప మిగతా అన్నిటికి అనుమతించారట. కొత్తగా పెట్టే 2350 ఫ్యాక్టరీలు 165 కోట్లరూపాయిలు పెట్టుబడితో పెరుతున్నారు. వీటిలో ఎరువులు, సిమెంటు, పంచదార, కాగితం, ఇంజనీరింగ్, గనులు, బట్టలు, నూలు, రసాయనములు, మందులు, తినుబడి వస్తువులు, మిషన్ పార్టులు వగైరా వున్నాయి. ఈ 2350 ఫ్యాక్టరీలు కాక మోటార్లు - రైల్వే ఇంజనులు, ఏరోప్లేనులు - ఓడల నిర్మాణాభివృద్ధికి ప్లానులున్నాయి. కొంతపని ప్రారంభమైంది.

యుద్ధానంతర పునర్నిర్మాణ ప్లానుల్లో విశ్వేశ్వరయ్యగారిదొకటి. తాతా బిర్లాగార్ల దొకటి. నేషనల్ ప్లానింగ్ కమీషన్‌వారి దొకటి. ఇంకా ప్రభుత్వానివి చాలా ప్లానులున్నాయి. ఆంధ్రాలో చదవ గలిగినవారంతా ఒకమారా ప్లానులు చదవాలి - అవి ఎంత అసమగ్రంగా వున్నా పారిశ్రామికాభివృద్ధికెంత సావకాశం వుందో విశ్వరూపదర్శనమైనట్టు కన్పిస్తుంది. రాజకీయైక్యతతో పోట్లాడి వుంటే బ్రిటిష్‌వాణ్ణి ఈ పాటికే వొదిలించుకొని ఈ పునర్నిర్మాణ ప్లానులు అమలు పరుస్తూ వుండేవారం ఇప్పుడైనా త్వరలో రానున్న ఇండో - బ్రిటిష్ వ్యాపార ఒడంబడిక చర్చల్లో మనం మెత్తబడకుండా నిలిస్తే బ్రిటిష్‌వాడి ఆటంకాలు సాగకుండాచేసి పరిశ్రమలింకా పెట్టుకోగలం. డబ్బుకు కొదవలేదు. యుద్ధానికి పూర్వం మన దేశం ఋణస్తురాలు. ఇపుడు ఋణదాత. మనకే ఇంగ్లండు 1500 కోట్ల రూపాయిలు యుద్ధంలో బాకీపడింది. ఆర్థిక శాస్త్రనిపుణుడు డాక్టరు లంక సుందరంగారిని నెహ్రూ గవర్నమెంటు అప్పుకోసం అమెరికా పంపింది. ఆయన వెయ్యి కోట్ల రూపాయిలిప్పిస్తే కడుపునిండా సరిపోతుందని చెప్తున్నాడు, అంతర్జాతీయ బ్యాంకులో మన "రూపాయి" గుర్తింపబడి ది. స్వతంత్రంగా ఏదేశంతోనైనా వ్యాపారం చేసుకునే హక్కు యిదివరకు లేదు. ఇపుడు కొద్దిగా వచ్చింది. అందువల్ల మనకు పెట్టుబడి పెట్టడానికీ మిషినరీ యివ్వడానికీ వర్తక ఒడంబడికలు చేసుకోడానికీ అమెరికా ఇంగ్లండులు పోటీలు పడుతున్నాయి బట్టలు, నూలు మిల్లుల మెషినరీ తేడానికి నెహ్రూ గవర్నమెంటు ఈ మధ్యనే టెక్స్‌టయిల్ బోర్డు అధ్యక్షుడు కృష్ణరాజు ఠాక్రేని ఇంగ్లండు పంపింది. అక్కడ దొరకకపోతే అమెరికా వెళ్ళమంది. ఆయన 100 కోట్ల రూపాయిల మెషినరీ కొని తెస్తానన్నాడు. నెహ్రూ గవర్నమెంటు రాక

ముందే - కొందరు కాంగ్రెసునాయకులు ఇంకా జైళ్లో వుండగానే, బిర్లా తాతా వగైరా కొత్తఫ్యాక్టరీలకు మిషనరీకొనడానికి అమెరికా, ఇంగ్లండు వెళ్ళివచ్చేరు. వీరిద్దరూ వెళ్తుంటేమొదట గాంధీగారొప్పుకో లేదు. "నాయకులంతా జైళ్లోవుండగా మీరీవిధంగా ఇంగ్లాండుతో వర్తకరాయబారాలు జరపడం, మీరే స్వాతంత్రంగా వ్యక్తిగతంగాయుద్ధానంతరపు పునర్నిర్మాణానికి ఫ్యాక్టరీలు కొనుక్కొని రావడం దేశద్రోహం" "అని గాంధీగారన్నారు. తాతా బిర్లాలూరుకోలేదు. "ఈపదునైనసమయంలో భీష్మించుకొని జైళ్లోవున్న నాయకులకోసం మేము ఆగితే – ఉన్నకాస్త మిషనరీ ఇతరదేశాలవారు కొట్టేస్తారు. మనం పరిశ్రమలు పెంచగల్గినపుడు పెంచకపోవడం, ఆలస్యం చేయడం అంతకన్నా దేశద్రోహ మన్నారు" అంచేత నీవుతప్పకుండా మాకు ఆశీర్వాదాలు పంపుతావా? లేవా? నీ ఆశీర్వాదం మేముకరాచీలో విమానం ఎక్కేసమయానికి అందాలి సుమా। అని జవాబిచ్చారు అచ్చంగా అల్లాగే అక్కడికే ఆశీర్వాదాలు వెళ్లేయి.

స్వలాభంకోసం పెట్టుబడిదారులు వేసిన చప్పుప్లాను తాతా బిర్లా ప్లాన్. దాని అంచనా ప్రకారం ప్రస్తుతం మనప్రజల సాలీనా అమూంబాపతు సంపాదనంతా 2200 కోట్లు. ఈ ఆదాయాన్ని 15 ఏళ్ళలో 6600 కోట్లకు పెంచాలనిప్లాను. నదులన్నింటికీ ఆనకట్టలుకట్టి గనులన్నీ తవ్వి సావకాశమున్న పరిశ్రమలన్నీపెట్టి ప్రజలజీవిత పరిమాణంపెంచాలి. అపుడు వుత్పత్తి, దేశీయవర్తకం, అంతర్జాతీయవర్తకం, రాకపోకలు, విజ్ఞానం అన్నీపెరుగుతాయి.

నెహ్రూ నాయకత్వం క్రింద నేషనల్ ప్లానింగ్ కమీషన్‌వారు వివిధశాఖల ప్రాథమిక రిపోర్టులు ప్రకటించారు. అదీ పెట్టుబడివారీ పునాదులమీద వేసిందే గాని తాతా, బిర్లా ప్లానుకన్న చాలా మెరుగు. * కీలక పరిశ్రమలు, రవాణా పరిశ్రమలు ప్రభుత్వం చేతిలోనే వుండాలన్నారు. 40 కోట్లమంది ప్రజలికి - కనిష్టజీవిత ప్రమాణం (ఇక ఇంతకన్నా తగ్గకూడదనే ఆదాయం) నిర్ణయించాలన్నారు. అది లభించేట్టు

* కీలకపరిశ్రమలనగా ఎలక్ట్రిసిటీ, గనుల్లోంచి తీసే చమురు, గ్యాస్, లోహములు, మిషన్ పార్టులు చేసే పరిశ్రమ, మిషనరీపరిశ్రమ భారీయింజనీరింగ్ పరిశ్రమ (స్టీమర్లు-రైళ్ళు-విమానాలు చేసేవి) ముఖ్యరసాయనములు-ఎరువులు-

ప్లాన్ వేయాలన్నారు. మన ప్రజలికి "ఏంకావాలి?" అని ఆలోచించే టప్పుడు దేశం అంతా గ్రామస్వయంపోషక సిద్ధాంతంమీద ఊహించక పారిశ్రామిక దేశం. పారిశ్రామికజాతిగానే భావించి ఆవిధముగా అభివృద్ధి పొందడానికే ప్లాన్ వేయాలన్నారు

ఇక్కడే జె. సి. కుమారప్పగారు-గాంధీగారి భక్తుడు. ఆసభ్యుల్లో ఒకడు-పేచీ పెట్టాడు. పెడితే ఏమైంది? జవహర్‌లాల్ మారలేదు. నేషనల్ ప్లానింగ్ కమీషన్ సిద్ధాంతాలు మార్చుకోలేదు. కుమారప్పగారు రాజీనామా పెట్టారు. జవహర్‌లాల్ దాని ప్రెసిడెంటు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీతీర్మానం ప్రకారం ఆ కమిషన్ ఏర్పడ్డది. దానినిండా రాష్ట్ర కాంగ్రెస్ మంత్రులు సభ్యులు. అందులో గాంధీ సిద్ధాంతాలకి స్థానం లేకపోయింది. గాంధీ సిద్ధాంత తిరస్కృతెంతవరకు వెళ్ళిందంటే — జనాభా అభివృద్ధిని క్రమబద్ధంచేయడానికి-కృత్రిమసంతాన నిరోధమార్గాలు గూడా ప్రజలకు నేర్పాలన్నారు. గాంధీజీ అంతరాత్మ చివుక్కుమని పించే ఘోరవిషయం గాదా ఇది? •

### ఈ ప్లానులోని కొన్ని వివరాలు

| | నికరాదాయం 1931—32 | టాటా, బిర్లా ప్లానుప్రకారం 15 సంవత్సరాలలో పెరుగుదల అంచనా | పెరుగుదల ఎన్నిరెట్లు? |
|---|---|---|---|
| పరిశ్రమలు | 374 కోట్లు | 2 240 కోట్లు | 5 రెట్లు |
| వ్యవసాయం | 1116 .. | 2,670 .. | $1\frac{1}{3}$ .. |
| ఉద్యోగాలు | 484 .. | 1450 .. | 2 .. |

• మనమంత్రి గిరిగారుగూడా అందులో సభ్యులే. ఇప్పుడు ప్రకాశంగారిని బలపర్చే గిరిగారు అప్పుడు కుమారప్పగారిని బలపర్చి వారితో కలిసి రాజీనామా పెట్టారా? లేదు. అప్పుడు ఇన్నిచిక్కులు వస్తాయని అనుకోలేదు పాపం! మరొకచిత్రం! గిరిగారు మొన్ననే 28-8-46 తేదీని గుడియాతంలో రాజేశ్వరి మిల్సు అనే నూలుమిల్లుకు శంఖుస్థాపన చేసి వచ్చారు. అప్పుడు ఉపన్యసిస్తూ ఏంచెప్పారు? "ఇంతకన్న మంచిసమయం మిల్లులు పెట్టడానికి మరొకటి లేదన్నారు. అందరికీ తిండి, బట్ట, వసతి చాలినంత సమకూర్చలేని ప్రభుత్వం ప్రభుత్వం గాదన్నారు. పాపం! ఆ శంఖుస్థాపన చేసిన తడి యింకా ఆరనే లేదు— "నీ మిల్లును రద్దుచేసుకో, నీవు సభం బిల్డింగు కట్టినా నీకు కదరు రానీయం." అని అక్టోబరులో మిల్లుయజమానికి తాఖీదు యీశంఖుస్థాపకుడే పంప వలసి వచ్చింది. రెండునెలల క్రిందటొకమతం, నేడొకమతం—గిరిగారంతటి వారికి!

పరిశ్రమలు లేక ప్రస్తుతం వ్యవసాయంలో గిట్టినా గిట్టకపోయినా చిన్నరైతులుగా, వ్యవసాయకూలీలుగా అనవసరంగా ఎక్కువమంది వ్యవసాయకులైపోయేరు. దీనివల్ల చాలీచాలని ముక్కల ముక్కల క్రింద తయారైంది భూమి. తక్కువాదాయంలో నలిగిపోతున్న వారందరికీ మిషనరీమీద పనిచేయడం నేర్పి భారీ పరిశ్రమల్లోకి తీసుకోవాలి.

ఇప్పుడు నూటికి 14 గురు చదువుకున్న (కొంకిరిగీతల్తో సంతకం చేయగలవారు) వారున్నారు. నూటికి నూరుమంది చదువుకున్నవారవ్వాలంటే ఇంతకు 7 రెట్లు కొత్తమేష్టర్లుకావాలి. కొత్తబిల్డింగులుకావాలి. వయోజనులు, పెద్దలుగూడా నిర్బంధంగా చదువుకోవాలంటే, వాళ్ళని, తక్కువగంటలు పనిచేస్తే ఎక్కువాదాయంవచ్చే వృత్తులలో, పెట్టి విశ్రాంతిఇచ్చి చదువుచెప్పాలి. విదేశాల్లోలాగే శిశుపోషణాలయాలు గూడా ప్రతివూళ్ళోపెట్టి ప్రభుత్వఖర్చుమీద మంచిఆహారం పోషణయివ్వాలన్నారు. దీనిమీద సర్. సర్వేపల్లి రాధాకృష్ణగారు రిపోర్టుతయారుచేసి నేషనల్ప్లానింగు కమీషన్కి దాఖలుచేశారు. సార్జెంటు విద్యావిధానస్కీం అనేదొకటుంది. దానిప్రకారం 18 లక్షలమంది మాష్టర్లేకావాలి.

ఆరోగ్యం: ఇంగ్లండ్లో 776 మంది కొక డాక్టరు చొప్పున వుంటే, మనదేశంలో 9000 మంది కొకడు. అక్కడ 435 మంది కొక నర్సు చొప్పున వుంటే, మన దేశంలో 86000 మంది కొక నర్సు. గ్రామాని కొక ఉచిత ఆసుపత్రి ఐనా వుండాలంటే ఇంకా ఎందర్ని డాక్టర్లుగా చేయాలి? ఎన్ని బిల్డింగులుకట్టాలి? ఎందరు నర్సులుకావాలి? 1471 పట్టణాలలో 253 లో మాత్రమే నీటికుళాయిలున్నాయి. కనీసం పట్టణాల్లోనైనా నీటిపంపులు వద్దా? మంచినీరు ఆరోగ్యకరమైన పద్ధతిలో సప్లయి చేయకపోతే జబ్బులు పెరుగుతాయిగదా!

ప్రతి మనిషికి కనీసం 30 గజాలైనా బట్ట లేకపోతే సంసారంలో నర్దుకోడం కష్టం. ప్రస్తుతం మిల్లుల్లోను చేనేతమీద వచ్చేది మనిషికి 16 గజాలే. దీనికి రెట్టింపు వుత్పత్తి పెరగాలి.

1941 జనాభా ప్రకారం ఇళ్ళులేని వారందరికి ఇళ్ళు ఎంత చవుకగా కట్టినా 1400 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలట.

ప్రజలు దారుఢ్యంగాపెరగడానికి తగినతిండి తినలేకపోతున్నారు. శాస్త్రపరిశోధన ప్రకారం 2,600 కెలొరీస్ శక్తిగల తిండి మనిషికి

రోజుకు కావాలి. యుద్ధానికిపూర్వం ధరలనుబట్టి చూచినా ఈ తిండి సాలుసు రు 65 ఖరీదౌతుంది. మనకి తల 1 కి సాలీనాఆదాయం అంతా కలిపి ఇంతలేదు. దీనిని సవరించడానికి తిండి ఖర్చు ప్రత్యేకం 2100 కోట్ల రూ॥లు సాలీనా కావాలి.

మన దేశంలో 2 కోట్ల 70 లక్షల కిలోవాట్ల ఎలక్ట్రిక్ శక్తికి సావకాశం వుంది. అందులో 5 లక్షలుమాత్రమే ఉపయోగిస్తున్నాము. ఇంకా ఎంత పెంచగలమో చూడండి.

రైల్వేలైను కొత్తగా 21000 మైళ్ళు వేస్తేనేగాని చాలదంటు న్నారు. ఇపుడున్నదానిలో సగం పెంచాలి. కొత్త కంకర రోడ్లు ఇంకా 300 000 మైళ్ళు వేస్తేనేగాని, 1000 జనాభాగల ప్రతి గ్రామం పెద్ద రోడ్డుకు 1½ మైలులోకిరాదు. ఇంకా ఎన్నోవున్నాయి.

వీట్లన్నింటికి అదనంగా 17 కోట్లు జనం, దారుఢ్యంవుండి పని చేసే మనుషులు కావాలి. ఎక్కడినుంచి వస్తారు? ఇతరవృత్తుల్లోంచి తీసి— కొత్తవృత్తులు నేర్పి—పరిశ్రమల్లో పెట్టాలి. తక్కువాదాయంగల వృత్తుల్లోనివారు మేం కదలమంటే—కదపవద్దని ప్రకాశం మంత్రిగారు పట్టుబడితే—ఈప్లానెట్లా అమలు జరుగుతాయి? ఎక్కువాదాయంవచ్చేవి కన్పిస్తున్నప్పుడు కదపవద్దంటే మాత్రం ప్రజలాగుతారా? ఈప్లానులు అమలు జరిగితే దేశం ప్రజలెల్లావుంటారు? ప్రకాశంగారి ప్లాన్ జరిగితే ఎల్లావుంటారు? ఊహించుకోండి. ఇన్ని మిల్లులు, పరిశ్రమలు మనం పెట్టుకోవాలిగదా! నిరుద్యోగ భయందేనికి? ఒక్కబట్టల మిల్లులే పెట్టి ఊరుకుంటే బట్టంతా ఖర్చు అవ్వదు. మిగతా పరిశ్రమలు పెరగకా, ప్రజాసామాన్యం ఆదాయం పెరగకాను.

అన్ని పరిశ్రమలూ పెరగాలనే ఇటీవల మద్రాసు మంత్రివర్గం కొత్తగా పరిశ్రమల పెట్టుబడిబ్యాంకిని పెడ్తామన్నారు. అలాగే నెహ్రూ ప్రభుత్వంవారు మరొక బ్యాంకును ఏర్పరుస్తున్నారు. ఎందుకు? కుటీర పరిశ్రమాభివృద్ధికోసమా? కాదు చుట్టూతా భారీపరిశ్రమలన్నీ పెంచు తుంటే ఒక్కబట్టలు విషయంలోను, నూలు విషయంలోను మినహాయిం పెందుకు? రాజకీయ పోరాటంలో విప్లవంలో బయలుదేరిన నినాదాలు వాటిపని పూర్తిఅయినతర్వాతకూడా చాలాకాలంపరకు ప్రజలహృదయాల నుండి వదలవు. ఖద్దరలాంటిదే కొంతవరకు. ఐనా దానికోసం మిల్లుల సరికట్టడం ఖచ్చితంగా అభివృద్ధి నిరోధకం గాబట్టి ఆవిధానం మద్రాసు

మంత్రివర్గం మానుకోవాలి. అన్ని పరిశ్రమలకన్న నూలు మిల్లులకు, బట్టలమిల్లులకు మన రాష్ట్రంలో ఎక్కువ సావకాశాలున్నాయి.

| సం॥ | కదుళ్ళు | బేలుకు పౌ 400 చొ॥ మవరాల ధానిలో మిల్లులు వాడిన దూది |
|---|---|---|
| 1930 | 7,56,204 | 211,000 |
| 1935 | 9,76,402 | 312,000 |
| 1940 | 14,06,812 | 507,000 |
| 1945 | 15,60,804 | 604,000 |

ఈ పరిశ్రమాభివృద్ధిమీద ప్రత్తిపంటదారుయొక్క శ్రేయస్సు ఆధారపడివుంది. మనమిక్కడ పండించేదంతా కాంబోడియాదూది. అది చేతి రాటాలకు పనికిరాదు. మిల్లులకు మాత్రమే పనికివస్తుంది. ఇపుడుకేంద్ర ప్రభుత్వం యిస్తానన్న కదుళ్ళన్నీ ప్రకాశంగారు తీసుకుంటే అచిర కాలంలో మొత్తం సాలీనా 18 కోట్ల రూపాయిలు ప్రత్తి ఉత్పత్తిదారులకు లభించే సావకాశం గల్గుతుందని మద్రాసు వ్యావసాయిక ఛాంబర్ ప్రెసిడెంటు బి. రామచంద్రారెడ్డిగారు ప్రకటించారు.

రాయలసీమలో అస్తమానం కరువులు, అవి వచ్చునపుడల్లా ప్రభుత్వం కరువుక్యాంపులుపెట్టి లక్షలు, కోట్లుకర్చుపెట్టడం, ఐనా ప్రజలు, పశువులు లెక్కలేకుండా చావడం, జరుగుతుంది. అక్కడే యీ కాంబోడియా ప్రత్తి యెక్కువగా పండుతుంది, ఇప్పుడు మిల్లుల నరికడితే అక్కడి రైతులకు మార్కెటుపడిపోతుంది. అక్కడి ప్రజలెక్కువగా ఉత్తరసర్కారుల్లోలాగకాంగ్రెస్ఉద్యమంలోపాల్గొనలేరు. రాజకీయచైతన్యం తక్కువ. ఐనా ఖద్దరు రాట్నాలు మాగాణీజిల్లాల్లోకన్న ఎక్కువవున్నాయి. కరువుప్రాంతాల్లో కాంగ్రెసుద్యమం తక్కువ—ఖద్దరుత్పత్తి ఎక్కువ. మాగాణిప్రాంతంలో కాంగ్రెసుఉద్యమం ఎక్కువ-ఖద్దరుత్పత్తి తక్కువ. ఎంచేత ? ఆర్థికంగా, కానీ అర్ధనా గిట్టేవృత్తిదొత్తిగా·కరువుప్రాంతంలో తప్ప—అనగా అదీలేకపోతే చచ్చేట్టయితేనే స్వీకరిస్తారు. కానిఅంత వెనకబడినప్రాంతాలలో విద్య, విజ్ఞానం,రాజకీయచైతన్యంగూడ తక్కువగానేవుంటాయి. అంచేత అక్కడ కాంగ్రెస్‌లో జైళ్ళకెళ్ళినవాళ్ళు ఇక్కడ కాంగ్రెస్‌లో జైళ్ళకెళ్ళినవాళ్ళకంటె తక్కువ. కానిఇక్కడకంటె ఖద్దరక్కడెక్కువుత్పత్తి అవుతుంది. మాగాణీప్రాంతంలో అంత కరువుండదు. కానీ, అర్ధనా ఆదాయంకోసం గంటలాది పనిచేసేవృత్తి కోసం ప్రాకులాడనక్కరలేదు. రాటాలుపెట్టరు. వేషంకావలిస్తే ఏఛరైనా

కొనేస్తాను. కానిఆర్థికంగా బాగుండకపోవల్ల ఈప్రాంతంలో విద్య,విజ్ఞానం అక్కడకన్నా జాస్తి. అందుచేతరాజకీయ చైతన్యంగూడాజాస్తి. అందుచే స్వతంత్రపోరాటంలో మెరకజిల్లాలకన్న మాగాణీజిల్లాలు ముందుంటాయి అంతేగాని, రాజకీయచైతన్యానికీ, రాటంవడకడానికీ వాస్తవిక దృష్టితో చూస్తేఏమీసంబంధంలేదు. ఆ సంబంధమేవుంటే మాగాణిప్రాంతంలో రాటాలెక్కువ వుండవలసింది. అల్లాలేదు.

రేపు తుంగభద్రాప్రాజెక్టు అమలులోకివచ్చాక అవన్నీ మాగాణీ భూములైతే రాటాలుఅక్కడగూడా సన్నగిల్లకతప్పదు. ఉత్తరసర్కారులలో విశాఖజిల్లాలో ఎక్కువఖద్దరు తయారవుతూంది. రామపాద సాగర ప్రాజెక్టునుండి పంటకాల్వలు విశాఖపట్నందాకా పోతే, అదీ మాగాణీయైతే—అక్కడా రాటాలు మూలబడతాయి

ఐతే, ఈలోపుగా రైతులకు రాటంతో మేలు చేయవచ్చుగదా? అంటారేమో. రైతులు ప్రస్తుతం రాటాలుకోరడంలేదు. వారినిఅభివృద్ధికి తెచ్చేమార్గాలు రాటంకన్నామంచివి చాలావున్నాయి. పేదరైతులకు బంజర్లన్నీయిచ్చి ఖాదీకి ఈ 3కోట్లువెచ్చించేబదులు వారిపెట్టుబళ్ళకోసం, పనిముట్లు, ఎరువులు పశువులకోసం యిమ్మనండి. బంజర్లన్నీ ఒక్క ఏడాదిలోబాగుపడతాయి. దానితోఆరైతులు బాగుపడతారు. సంపన్న రైతు ఎలాగూ వడకడు. పేదరైతుకూడా రాటంకాదుకోరుతున్నది. 17 కోట్ల 30 లక్షల యకరాలభూమి సాగుకు అనువైనది—బీడుగా వుండిపోయిందని ప్రభుత్వలెక్కలు చెప్తున్నాయి. దాన్నికోరుతున్నారు.

ఒకప్రక్కను ప్రజలకు స్వాతంత్ర్యంవుంది. ఖద్దరు నిర్బంధంచేయమని చెపుతూ మరోప్రక్క మిల్లులకు కదుళ్ళివ్వడం అంటే దాన్నేమనాలి? నిర్బంధం, స్వతంత్రం. వీటితో నిర్బంధించి స్వతంత్రంలేకుండా చేస్తామని చెప్పుకోడానికి అదే మావిధానం అని ఒప్పుకోడానికి ధైర్యంలేదు. ఈ కాలంలో పేరుకైనా ప్రజాస్వామికం అనే ముసుగొకటికావాలి. కాని నిజంగా స్వతంత్రమిస్తే ఎప్పటికీ రాటాలు పెరగడంలేదు. కాంగ్రెసుపేరు చెప్పిగూడా మిల్లులే పెరుగుతున్నాయి. అందుచేత స్వతంత్రం నిజంగాయివ్వడానికి మనస్కరించదు. అందుచేత నిర్బంధించనూలేక, నిర్బంధించపోనూలేక, నేడొకలాగని, రేపొకలాగని, నిర్వచనాలు మరొకలాగచేసి బాధపడవలసి వస్తోంది మంత్రివర్గానికి. గాంధీగారి దగ్గరనుండి హుషారు రాకపోతే ఒకలాగ, వస్తేమరొకలాగ, తక్కువ హుషారువస్తే ఒకలాగ

ఎక్కువ హుషార్‌వస్తే మరొకలాగ మాట్లాడవలసి వస్తావుండిపాపం! ఇంతపట్టుదల ఖాదీమీద మొదటినుండీవుండే ప్రకాశంగారు ఎలక్షనుల ముందు ఎలక్షన్ ప్రణాళికలోనే యిట్లాచేస్తామని చెప్పలేకపోయేరూ? అపుడీ వుద్దేశంవుండి చేర్చలేదని అనుకోరాము. అదినిజమైతే దగా అవుతుంది. అపుడులేని ఉద్దేశం యిపుడు కలిగింపనుకోరాదు. అందేక ఎలక్షన్ ప్రణాళికకు వ్యతిరేకం అన్నమాట

ఇదేంఖర్మమయ్యా! ఇన్నిరాష్ట్రాల్లో కాంగ్రెసుమంత్రివర్గాలున్నాయి. ఎక్కడాలేనిది మనరాష్ట్రానికే వచ్చిందా? వాళ్ళంతా మిల్లులు పెంచుకోడమేమి? మనం మిల్లులన్నీ నాశనంచేసుకోడమేమి? అని ప్రజలంతా, పత్రికలన్నీ గోలపెడితే - ఆచార్యరంగాగారు మరొక స్టాంప్ వేసేరు. ఈ యంత్ర నిర్మూలన కార్యక్రమాన్ని దేశం అంతా సాగించమని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి, నెహ్రూ గవర్నమెంటుకు, సిఫారసుచేస్తూ తనజేబులో వున్న సంఘాలన్నింటిచేత తీర్మానాలుచేయిస్తున్నారు. డాక్టరు పట్టాభిగారు గూడా "ఇదిక్రమంగా దేశం అంతా పెడతాం. ప్రస్తుతం మనరాష్ట్రంలో ప్రారంభిస్తున్నాం" అన్నారు. కాంగ్రెస్ నియమించిన నేషనల్‌ప్లానింగ్ కమిషనులో యిలాంటి పిచ్చి పిచ్చి వూహలున్న జె. సి. కుమారప్పగారు రాజీనామా పెట్టవలసి వచ్చింది. మొన్న కేంద్ర శాసనసభలో నెహ్రూ మంత్రివర్గం ప్రకాశంగారి ఖాదీ విధానంమీద ప్రశ్నలువేస్తేగూడా ఆవిధానాన్ని సమర్థించలేదు. పైగా, కేంద్రప్రభుత్వం పరిశ్రమ విషయంలో రాష్ట్రాలకు మరమగ్గాలు వగైరా ఒక సూత్రప్రకారం పంపకంచేసి నిర్ణయించితే దానిని రద్దుచేయడానికి రాష్ట్ర ప్రభుత్వానికి అధికారం లేదని చెప్పేరు.

నిజంగా రంగాగారు, పట్టాభిగారు చెప్పినట్టు దేశం అంతా మిల్లులన్నింటినీ మట్టంచేస్తే ఎలా వుంటాం? 40 కోట్లమందికి కనీసం 20 గజాల చొ॥న 800 కోట్ల గజాలు బట్ట కావాలిగదా! రోజుకు 8 గంటలు చొ॥ సాలుకు 300 రోజులు పనిచేస్తే — 1 గంటకు 2400 గజాలు రాటంమీద దారంతీస్తే — ఒక చదరపు గజం బట్టకు 3000 గజాల నూలు కావలిస్తే — 3 కోట్ల 30 లక్షల మంది వడికేవారే కావాలి. వీరింకేపని చేయకుండా వడుకుతూ వుండాలి. ఈ నూలు తోడడం, పడుగుచేయడం, నేయడం, అంతా కల్పి ఒక చేనేతపనివాడు రోజుకు 8 గంటలు పనిచేస్తే రోజుకు దామాషాను గ 2½ గుడ్డనేస్తే

కోటి ఆరులక్షల కుటుంబాలు చేనేత ఉండాలి. పత్తిగింజలు తీయడానికి వడుకు సైజులో నూటికి 5 వంతులు కావాలి. దానికి 16 లక్షలమంది. ఏకడానికి 12½ వంతుల సైము కావాలి. దానికి 42 లక్షలు. 3 కోట్ల 10 లక్షల రాటాలు. 1 కోటి 6 లక్షల మగ్గాలు చేయడానికి — చెడినవి బాగుచేస్తుండడానికి 40 లక్షల వడ్రంగులు. 800 కోట్ల గజాల బట్టకు 55 లక్షల పేళ్ళ మీది కావాలి. దాన్ని పండించి, బాగుచేసి, ఎగుమతులు చేయడానికి — ఆమాం బాపతంతా కలిపి 7 కోట్లమంది ప్రత్యేకం ఖాదీ సిద్ధాంతం కోసం ప్రత్యేకించాలి ఎవర్ని? అదేపనిగా పని చేసేవాళ్ళని. తీరికసైములో చేసేవారైతే తీరికనుబట్టి 14 కోట్లు. 28 కోట్లుగూడా కావచ్చు. మనదేశంలో రోజూ 8 గంటలు అదేపనిగా పనిచేయగల వాళ్ళు 16 కోట్లని అంచనా వేశారు 16 కోట్లలో 7 కోట్లు తీసేస్తే ఇక 9 కోట్లమంది మిగులుతారు. వీరితో భూములన్నీ పండించాలి. గనులన్నీ త్రవ్వించాలి. ఇళ్ళన్నీ కట్టించాలి. రైళ్ళన్నీ నడపాలి. ఇంకా లక్షపనులున్నాయి. ప్రభుత్వం - సైన్యం - డాక్టర్లు - మేష్టర్లు ఇవన్నీ వదులుకుంటామా? కాని 1931 జనాభా ప్రకారం 16 కోట్ల మంది పనిచేయగల స్త్రీపురుషుల్లోను, 11 కోట్లమంది వ్యవసాయంలోనే వున్నారట. పోనీ, ఏదోవిధంగా తిండికి, బట్టకే ఉన్న ప్రజలందర్నీ ఉపయోగించి మిగతా పరిశ్రమలన్నీ మానుకుందామా? గుండుసూదులు మొదలుకొని విమానలదాకా మనదేశంలోనే తయారవ్వాలనడం దేశానికి అభివృద్ధిదాయకం. తిండికి బట్టకే ప్రజలందరినీ సరిపుచ్చాలనడం అభివృద్ధి నిరోధకం. దేశాన్ని దివాళా తీయించడం.

ధర విషయం గూడా అప్రధానమైనదిగాదు. మిల్లు బట్ట మిల్లు నూలు రాకుండాచేస్తే ఫిర్కాల్లో చచ్చినట్టు వడుక్కుంటారని కోపడం భ్రమ. దొంగమార్కెట్టు పెరుగుతుంది, మిల్లు నూల్లోనూ మిల్లు గుడ్డ లోనూ, ఇతర బట్టల్లాగ ఖాదీలో అందచందాలెక్కువరావు కష్టపడి చెప్పినా విపరీత ధరలు. పేద కూలీకి రు. 3 లు మిల్లుచీర వస్తుంటే, రు. 13 లు ఖాదీచీర కొంటాడా? దేశభక్తి యింత ధర వ్యత్యాసం మీద నిలబడుతుందా? నిలబెట్టుకున్నా చేతిలో పైసాఏది? నె 60 రు చేనేతచీరలు మధ్యతరగతి స్త్రీలంతా వాడుతున్నారు. అది రు. 15 లు అయితే తత్తుల్యమైనది ఖాదీలో రు. 50 లు. స్త్రీలలో తిరుగుబాటు రాకేం చేస్తుంది ప్రకాశంగారి పట్టువిడవకపోతే?

ఈ మిల్లు నిర్మూలన విధానం ప్రకటించాక ఆంధ్ర-అరవ తగాయిదాలు గూడా పెరిగాయి. వాటంతటవి పెరగలేదు. బాధ్యతగల నాయకులే పెంచారు. ఇటీవల రంగాగారు మంత్రివర్గ స్కీంను బలపర్చమని ఆంధ్రులనుకోరుతూ కావలసినంత అరవద్వేషంరేకెత్తించారు. "అరవలు ఆంధ్ర ప్రధానమంత్రిని దించేయాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. ఇప్పుడాంధ్రులకర్తవ్యం ఐక్యకంఠంతో ప్రకాశంగారిని బలపర్చాలి." ప్రకాశంగారి విధానాన్ని తిరస్కరించడమంటే అరవ ప్రధానిని కొనితెచ్చుకోడమన్న మాటని ప్రచారం చేస్తున్నారు. పరిశ్రమలనభివృద్ధిచేస్తే రాష్ట్రం బాగుపడుతుందా నిర్మూలిస్తే బాగుపడుతుందా? అనే చర్చను బుద్ధిపూర్వకంగా అప్రధానంచేసి, ప్రకాశంగారిని దించడానికి అరవలు కృషిచేస్తున్నారు. నీవు ఆంధ్రులను సపోర్టుచేస్తావా? అరవలనా? ఇదిప్రధానమైన ప్రశ్న అని చిత్రించడం ఉత్త కపటనాటకం. ఒక విషయంయొక్క మంచిచెడ్డలమీద చర్చ జరుగుతున్నప్పుడు తన వాదనను సహేతుకంగా బలపర్చుకోలేని బలహీనుడు ఇతరుల వాతావరణం సృష్టించి అంతా కంగారుపరుస్తాడు.

నూలుకు, గుడ్డలకు కంట్రోలక్కరలేదన్న ఈ అవకాశవాది ఆంధ్రుల వస్త్ర సమస్యలో మొదటినుండి తీసుకొచ్చిన గందరగోళం అపారం వారి శిష్యులు ప్రగడ కోటయ్య వగైరా లిపుడు ప్రకాశంగారి ఖాదీ స్కీం నెలా చేనేత ప్రజల్లో ప్రచారం చేస్తున్నారో మచ్చుకు కొక ఉదాహరణ యిస్తాను. "చేనేత పారిశ్రామికుల్లారా! మీరు మిల్లు నూలు ఎక్కువ కోరుకోకండి. ఎక్కువ నూలువస్తే మార్కెట్టులో సరుకు ఎక్కువై మనకంతగాగిట్టదు. తక్కువ నూలు వస్తేనే ప్రజలకు తక్కువ బట్టలుంటాయి. అపుడు మీరెంతధర చెప్పినా చచ్చినట్టు ప్రజలు కొంటారు. ఆమిల్లు నూలు అయిపోయినాక వడుకునూలు ఏమైనా దొరికితే నేయండి. దానిలోవచ్చినంత వస్తుంది - ఈవిధంగా ఈమధ్య చేనేత కాంగ్రెసు సభల్లో ఉపన్యాసాలు దంచుతున్నారు. ఇది ఏం విధానం? "కరువు రావాలి. రాకపోతే మన సరుకుకు ధర రాదు. ధరనిలబడాలంటే కరువు ఎన్నడూ పోగూడదు. కరువును సృష్టించడానికి ఉత్పత్తి పెరగకుండా ఆపాలి" ఇది దేశభక్తా, దేశద్రోహమా? ఇది ఆంధ్రప్రజల ఐక్యతకు దారితీస్తుందా? ఒక తెగనుచూస్తే మరో తెగకు ద్వేషం కల్పిస్తుందా? నాయకులు, సంస్థలు తమపలుకుబడిలోని ప్రజల్లో స్వార్థాన్ని బాగా ప్రకోపింప చేయబట్టే-దొంగమార్కెట్టనేది చేనేత కాంగ్రెసు పెద్దలకు ఒక

పాపకార్యంగా కనపడ్డంలేదు. నిత్యకృత్యమై పోయింది. ఆంధ్రలో ప్రధాన వస్త్రనిర్మాతలైన చేనేత పారిశ్రామికుల్లో ఇలాంటి నీచప్రచారం ఒకవైపు చేయిస్తూ రంగాగారు తన రాజకీయాలన్నీ గాంధీరాజకీయాలని వాహాలాడుకుంటున్నారు.

ఈ రంగాగారిపుడు ఆంధ్ర-అరవ లగాయిదాగా—మిల్లు నిర్మూలన కార్యక్రమానికి రంగుపూస్తున్నారు. ప్రకాశంగారి విధానాన్ని ఖండించే వారు ఆంధ్రలోకన్నా తమిళనాడులో ఎక్కువమంది వుంటారు. నిజమే. కారణం ? అక్కడభివృద్ధికొస్తూ వొస్తూవున్న పరిశ్రమమీద పిడుగు పడింది. శుక్లపక్షచంద్రునిలా పెరుగుతూ పెళ్ళీడు వచ్చిన బిడ్డకు అకస్మాత్తుగా "క్షయ" రోగం దాపురించితే (ఇంక క్రమంగా చావడంతప్ప పని డాక్టరన్నాడు.) ఎంత బాధగా వుంటుందీ ? గర్భంలో పెరుగుతూ వున్న పిండానికి గర్భస్రావమొస్తే ఎంతబాధగా వుంటుంది ? రెండోదీ బాధేగాని, దానికన్న మొదటిది ఎన్నోరెట్లుఎక్కువబాధ. అంచేతే మధుర వైద్యనాథయ్యర్‌గారు కాంగ్రెస్ఎం. ఎల్. ఏ; అసెంబ్లీలో తక్లీదారంతీస్తూ కూర్చొనేవారు. నిష్కల్మషమైన గాంధీవాది. ప్రకాశంగారి మిల్లునిర్మూలన విధానాన్ని మొదట బలపర్చలేదు. చాలరోజులూరుకున్నారు. కానియిటీవల గాంధీహరిజనవ్యాసాలుప్రకాశంగార్ని బలపరుస్తూరాయడంమొదలుపెట్టాక, వైద్యనాథయ్యర్‌గారుగూడ 'సరే' నన్నారు. తక్లీని 24 గంటలువదల లేని అరవఖాదీసిద్ధాంతి అంతటతటాపటాయించి ప్రకాశంగార్ని బలపర్చడమేమి ? ఆంధ్రలో సాలుకు ఒక్కమారైనా రాట్నాన్ని ముట్టుకోని గాంధేయులంతా ముందుగానే బలపర్చడమేమి ? తమిళనాడ్‌లో పరిశ్రమలభివృద్ధికొచ్చాయి. ఎక్కువమిల్లులు బయలుదేరాయి. మెట్టూరు ప్రాజెక్టుండి పెట్టుబడిదారీవర్గం మనకన్నముందుగా అక్కడపుట్టి అక్కడే పెరిగింది. మన రాష్ట్రంలో ఆలస్యంగా పెరుగుతూంది. ఇటీవలియుద్ధంలో సంపాదించిన లక్షలు ఆంధ్రపెట్టుబడిదారీ వర్గందగ్గర లేకపోలేదు. ఇప్పుడుమనమైనా మిల్లులు పెట్టలేకపోము. అంచేతనే ఆంధ్రవాణిజ్య మండలిగూడా ఆందోళనచేస్తూవుంది. ఆంధ్రకాంగ్రెస్ వెనకాలవున్న బలంఅంతా పెద్దరైతాంగం. తమిళ కాంగ్రెస్‌వెనకాల వున్నబలంలో ప్రధానతెగ పెట్టుబడిదారీవర్గం; భారీపరిశ్రమదారులు అంచేత తమిళకాంగ్రెస్ కమిటీ వెంటనే ప్రకాశంగారి విధానాన్ని ఖండించింది.

రాష్ట్రాలమధ్య హెచ్చుతగ్గులుపెట్టి అసమానత్వం సృష్టించి కలహాలు రేపడం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల విధానం. దాన్నిసవరించాలంటే అది ప్రకాశంగారి చేతిలోనిపని. ఆంధ్రలోగూడా ప్రాజెక్టులు త్వరగా కట్టమనండి. అసమానత్వం కొంతతగ్గుతుంది. ఆంధ్రలో త్వరలోపరిశ్రమలు పెట్టమనండి. అసమానత్వం యింకాతగ్గుతుంది. రాయలసీమలో చురుకుగా పరిశ్రమ అభివృద్ధిచేయమనండి. సర్కారులకు రాయలసీమకు మధ్యనున్న అసమానత్వం తగ్గిపోతుంది. ఈదృష్టితో ప్రభుత్వం పని చేయాలి. ప్రభుత్వంలోపని చేయించుకోవాలిగాని, ఎక్కడికక్కడే తగాయిదాలురేపడం (ఆంధ్ర, అరవ) కుట్రలుసృష్టించడం, రాష్ట్రానికి చాలాఅపాయకరం. ఈ సోదరులమధ్య విరోధం, విషబీజాలు, మనం అశ్రద్ధచేస్తే పెరక్కమానవు. పెరిగితే ఇలాగేవుండవు.

ఏకారణం వల్లనైతేనేమి బొంబాయి - అహమ్మదాబాదుల్లో వస్త్ర పరిశ్రమ అంతరిక్షాల్లోకి పోయింది. ఒక రకంగా ఆ 2 పట్టణాలకి గుత్త వ్యాపారం అయిపోయింది. ఇతర రాష్ట్రాల్లో యిక ఆ పరిశ్రమ తనకు పోటీగా పెరక్కపోతే — ఆరాష్ట్రాలన్నీ తనమీద 'దాసోహం' అని ఆధారపడివుంటే — ఇక తమ అదృష్టం ఏమని చెప్పాలి? అని ఈ విధంగా గుజారాతీ సేట్లు-మిల్లుయజమానులు వ్యక్తుల వూహల్లో వుండ వచ్చు. ఆవ్యక్తులు చాలా బలమైన వారేకావచ్చు. మనచరఖా చావస్తం వారికిచాలా గిట్టుబాటుగానే వుండొచ్చు. కాని అది కాంగ్రెస్‌సంస్థయొక్క, కాంగ్రెస్ కేంద్ర ప్రభుత్వంయొక్క, పాలసీ కాగూడదు. రాష్ట్రాలమధ్య అసమానత్వం తొలగించడానికి తీవ్ర ప్రయత్నం చేయకపోతే రాష్ట్రాల మధ్య కలహాలు పెరుగుతాయి. ఆర్థిక పునర్నిర్మాణం ప్రారంభింపనున్న తరుణంలో యీవిషయం చాలాప్రధానమైంది. ఆంధ్రజాతికి అరవజాతిని చూస్తే అనుమానం. ఈ రెండుజాతులకు గుజరాతీ జాతినిచూస్తే అనుమానం. దీనికి మూలకారణమైన పారిశ్రామిక అసమానత్వాన్ని తొలగించాలి. జాతులసమస్యలో ఇదొక ప్రధాన విషయం. గుత్తవ్యాపారులు స్వప్రయోజన విధానం ప్రధాన రాజకీయపార్టీలు అనుసరిస్తే — దేశంలో జాతుల సమస్య, రాష్ట్రములసమస్య మరీ తీవ్రమవుతుంది. అది తెలిసి అనుసరిస్తున్నారా? తెలియకనా? అన్నది ప్రశ్నగాదు. అది చేయాలని చేస్తున్నారా, అవాంతరాలు వచ్చిచేస్తున్నారా అన్నదిగూడ ప్రశ్నగాదు. అవాంతరాలు ప్రకాశంగారి చాదస్తంవల్ల రావచ్చు. గుజరాతీ సేట్ల

సంకుచిత దృష్టివల్ల రావచ్చు. ఈ కారణాలు అప్రధానం. పర్యవసానంలో అసమానత్వం తొలగకపోతే కొరివితో తలగోక్కున్నట్టు మన జాతులసమస్యను మనమే తీవ్ర పర్చుకుంటాము. ఈ సిద్ధాంతం ఒక్క బట్టల నూలు మిల్లులకేగాదు; అన్ని పరిశ్రమలకు, ప్రాజెక్టులకు, వర్తిస్తుంది. పునర్నిర్మాణ ప్లానులన్నింటికీ వర్తిస్తుంది.

## ముగింపు

ఆంధ్రలో వస్త్రసమస్య ఒక్కొక్క దశలో ఒక్కొక్క రూపం దాల్చింది. కొన్నాళ్ళు అయ్యో! లాంకెషైర్ వర్తకులు, జపాన్ వర్తకులు బట్ట దిగుమతి చేసి మనల్ని దోచుకుంటున్నారే అని గోలబెట్టాం. మరికొన్నాళ్ళు ఇవతల అహమ్మదాబాద్ మిల్లులు, పైదిగుమతులు కలిసి బట్టలు రాసులు దించి 2 లక్షల చేనేత కుటుంబాలకు ఇక్కట్టు తెచ్చి పెట్టారే అని గోలబెట్టాం. ఆ రెండుదశలు ఒకే ఆటలో మొదటిభాగం, ఆఖరిభాగమున్నూ. ఇప్పుడు ఆ దశ అయిపోయింది. ఈదశలో దిగుమతులులేక, మిల్లుబట్టలేక, చేనేతబట్టలేక ప్రజలు మాడుతున్నారు. కోటాగుడ్డరొస్తే కొట్లవద్ద గుంజులాటలో కొత్తచొక్కాకోసం వెళితే ఉన్న చొక్కా చిరుగుతుంది. ఈ ప్రజలందరికీ ఇదివరకన్నా ఎక్కువ బట్ట ఎల్లా అందివ్వాలి? అన్నది ప్రస్తుతసమస్య. ఈ దశలో ప్రజా మంత్రివర్గాలు రాష్ట్రంలోను, కేంద్రంలోను పనిచేస్తున్నాయి. ఇదివరకు ఈ మంత్రివర్గాలు లేవు. నీ దేశాన్ని నీ యిష్టంవచ్చినట్టు సరిదిద్దుకోడానికి ఇదివరకు నీ చేతిలోపెత్తనం లేదు. ఇప్పుడు నీ చేతిలో అధికారంవుంది.

అంచేత కొత్తమిల్లులు పెట్టితీరాలి. పాతమిల్లులకు కొత్త కదుళ్ళిచ్చితీరాలి. ఈ లోపున ఉన్న మిల్లుల్లో దొంగమార్కెటును అరికట్టడానికి తీవ్రచర్యలు తీసుకోవాలి. ప్రస్తుతం మిల్లులను 3 షిఫ్టులమీద పనిచేయించి ఉత్పత్తి పెంచాలి. చేనేతపారిశ్రామికులకు నెలకిరవై రోజులకు సరిపడ్డ నూలైనా గ్యారంటీచేయాలి. వారికి కనీస మజూరీ గ్యారంటీచేసి చేనేతబట్టకుగూడా సీలింగ్ రేట్లు నిర్ణయించాలి. మిల్లుగుడ్డ చేనేతగుడ్డ కలిపి రేషనింగ్‌పెట్టాలి. ఇది గుడ్డల సమస్యకు మన రాష్ట్రంలోసక్రమ పరిష్కారం.



ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ—పర్మిట్ నెం. కె. 13/సి.—5000—21-12-46

ప్రచురణ నెం. 188 నాలుగణాలు

# ఈ క్రింది పుస్తకాలన్నీ కొత్తగా వెలువడ్డాయి

| | |
|---|---|
| ఎట్టి నష్టపరిహారం లేకుండా జమీందారీ విధానం రద్దుచేయాలి | 0-3-0 |
| నిరంకుశత్వానికి వ్యతిరేకంగా నైజాం ఆంధ్రుల పోరాటం | 0-3-0 |
| ఆంధ్రలో ప్రాధమికోపాధ్యాయుల స్థితిగతులు | 0-2-0 |
| బిడ్డలవిషయమై మనముసోవియట్లు | 0-2-0 |
| బర్మా స్వాతంత్ర్య పోరాటం | 0-4-0 |
| మద్రాసు ప్రభుత్వమా ఎక్కడికి? | 0-2-0 |
| తెలంగాణా (బుర్రకథ) | 0-4-0 |
| నైజాంలో ముస్లిములు | 0-1-0 |

ప్రజాశక్తి ప్రచురణాలయం
బెజవాడ

ని ప్రపంచంలో ఒక గొప్పదేశమైన రష్యా. మనం పరస్పరం సహాయం
కుంటూ చేయవలసిన పనులెన్నోవున్నాయి. ఆదేశానికి నాఅభివందనాలు"

—నెహ్రూ (సెప్టెం. 7, 1946)




రచన

తమ్మారెడ్డి సత్యనారాయణ


" రష్యా, పర్షియన్ సింధుశాఖలో ఒక కాలుమోపి
రెండోకాలును కరాచీలో పెట్టడానికి జాపుతున్నది"

—పట్టాభి (సెప్టెం. 17, 1946)

2

# దురాక్రమణదారులు ఎవరండీ పట్టాభిగారూ?

"అంతర్జాతీయ రాజకీయాలు తుకతుక ఉడికిపోతున్నాయి. మళ్ళీ యుద్ధం వస్తుందేమోనని ప్రజలు భయపడుతున్నారు. రష్యా మన గుమ్మంచేరి తలుపులు కొడుతున్నది. మనదేశ సరిహద్దుకు 40 మైళ్ళ దూరంలోనే రష్యన్లు ఉన్నారు. బెస్సరేబియా, బుకోవినాలను తన పొట్టను పెట్టుకున్న రష్యా డార్డినెల్సు జలసంధిపైదృష్టి ప్రసరిస్తున్నది. ఉత్తరాఫ్రికాతీరాన మెడిటరేనియన్ ఆశ్రయం సంపాదించాలని పడరాని పాట్లు పడుతున్నది. రష్యా పర్షియన్ సింధుశాఖలో ఒక కాలుమోపి రెండోకాలును కరాచీలో పెట్టడానికి జాపుతున్నది. రష్యనులు మన దేశంపై దండయాత్ర జరిపినట్లయితే ఇందులో అభూతకల్పనేమీలేదు. కమ్యూనిస్టులు ఎవరి తరపున పోరాడుతారు?

(ఆంధ్రపత్రిక. సెప్టెంబరు. 17)

ఈపైవాక్యాలుచెప్పింది ఎవరు? భారతదేశానికి శత్రువైన కరుడు గట్టిన సామ్రాజ్యవాది చర్చిలన్నాడా ఈమాటలు? లేక ప్రపంచాధి పత్యంకోసం కుట్రలు పన్నుతున్న అమెరికా సామ్రాజ్యవాదులన్నారా? కాదు కాదు. ఆంధ్రరాష్ట్ర ప్రముఖ కాంగ్రెసునాయకుడు, అఖిలభారత కాంగ్రెసు వర్కింగుకమిటీ మాజీ సభ్యుడైన డాక్టరు పట్టాభిగారి పలుకు లివి. బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులుచేసే సోవియట్ వ్యతిరేక ప్రచారానికీ, దీనికి ఏమీ తేడాలేదు. మన శత్రువులైన సామ్రాజ్యవాదులు, ప్రముఖ కాంగ్రెసునాయకుడైన పట్టాభిగారూ సోవియట్‌ను గురించి ఒకే రకమైన దుష్ప్రచారం చేయడంలోని రహస్యమేమిటి? నిజంగా సోవియటు మన దేశంమీద దాడికి తయారవుతుందా? అన్న విషయాలు ప్రతి దేశభక్తుడూ తెలుసుకోవాలి. అసలు యుద్ధానికి తయారవుతోంది ఎవరు? ప్రపంచ ప్రజలను స్థిరబానిసత్వంలో నుంచుటకు ఎవరు ప్రయత్నించుచున్నారు? ఈ విషయం మనం తెలుసుకున్నప్పుడు

ఎవరు మూడవ ప్రపంచయుద్ధానికి తయారవుతున్నారో, ఎవరు వలస దేశాలకు స్వతంత్రం ఇవ్వమని కోరుతున్నారో, ఎవరు స్వతంత్ర 'భక్షకులో' యెవరు స్వతంత్ర' రక్షకులో' తెలుస్తుంది. అప్పుడు పట్టాభి గారు చెప్పింది నిజమోలేక సామ్రాజ్య వాదులు చేసే ప్రచారాన్ని భుజాన వేసుకొని మోస్తున్నారో తెలుస్తుంది. ఈ క్రింది విషయాలు చూడండి. నిజానిజాలు బయటపడతాయి.

## ఇది ప్రజలను మోసపుచ్చడం

భారత జాతీయసైనికుల విడుదలకోసం జరిగిన ఆందోళనతో, భారత నావికుల తిరుగుబాటుతో, సామ్రాజ్యవాదుల గుండెలు బేజా రెత్తాయి. భారతదేశమంతా ఒక అగ్ని పర్వతంలాగా ఉందని గ్రహించారు. భారత ప్రజానీకం విప్లవానికి సిద్ధంగావున్నదని గ్రహించారు. అందుకనే లండన్ నుండి మంత్రి త్రయం పరుగెత్తుకు వచ్చి కాంగ్రెసు - లీగు నాయకులతో మూడునెలల పాటు మంతనాలు సాగించింది. భారతదేశానికి స్వతంత్ర మిస్తామంటూ నటించి కాంగ్రెసు - లీగు నాయకులను వంచించింది. ఈ విధంగా భారతదేశంలో వచ్చే విప్లవ జ్వాలలను కాంగ్రెసు - లీగు నాయకులచేతనే అణచివేయ ప్రయత్నించు తోంది. ఇంతే గాదు. మరొక రహస్యంకూడా ఉంది.

రెండవ ప్రపంచ సంగ్రామం సమాప్తితో యూరపులో ప్రజావుద్యమాలు విజృంభించాయి. తూర్పుయూరపులోని దేశాలన్నిటిలోను ప్రజలు నూతన ప్రజా ప్రభుత్వాలు ఏర్పరచుకున్నారు. దీనితో యూరపులో సామ్రాజ్యవాదానికి అనుకూలమైన రాజ్యాలు లేకుండాపోయాయి. యుద్ధం పూర్వం వరకు యూరపులో తమకు భళాభళీ అనే ప్రభుత్వాలుండేవి. నేడు అవి పోవడంతో యూరప్‌మీదుగా సోవియటుపై యుద్ధకుట్రలు పన్నడానికి వీలులేకుండా పోయింది. అందుచేత మధ్య ప్రాచ్యంలోను భారతదేశంలోను సోవియట్ వ్యతిరేక మిలిటరీ కేంద్రాలను ఏర్పరచడానికి చూస్తున్నది. మంత్రిత్రయ సంప్రదింపుల సమయంలో ఫీల్డు మార్షల్ మాంట్గొమరీ రావడంలో అర్థంకూడా ఇదే. ఈ విధంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో తమసేనలను, మిలిటరీశక్తిని పెంపొందించుకుంటున్నారు. ఇది కప్పిపుచ్చడంకోసం సోవియటుపైన నీలాప

విందలు వేయడం మొదలుపెట్టారు. సోవియటు యూనియన్ భారత దేశంపై దాడిచేయ వచ్చునని ప్రచారం మొదలుపెట్టారు. ఇక సామ్రాజ్య వాదుల బంటు అయిన రాయిటర్ వార్తాసంస్థ ఈ దుష్ప్రచారాన్ని ఎడ తెరిపి లేకుండాచేస్తోంది. మంత్రిత్రయ సంప్రదింపుల కాలంలో వైస్రాయి అంతరంగిక కార్యదర్శి జెంకిన్సు కాంగ్రెసు-లీగు నాయకులతో సోవి యటు ప్రమాదాన్ని గురించి చెప్పాడనికూడా వదంతి ఉంది.

ఈ విధంగా ప్రచారంచేసి, భారత ప్రజలను మోసంచేసి తమ సోవియటు వ్యతిరేక కుట్రలను సాగించాలని ప్రయత్నించుతోంది. సోవియటు దాడినుండి భారతదేశం రక్షింపబడా లంటే మా సైన్యాలు ఇచ్చట ఉండాలంటూ చెబుతోంది. ఈ మిషతో తమ సైన్యాలను ఇచ్చట ఉంచి భారత స్వాతంత్ర్యోద్యమాన్ని అణచ డానికి, సోవియటు వ్యతిరేక యుద్ధానికి సిద్ధమవుతోంది. అసలు విష యాలు ఇలా వున్నాయి. బ్రిటనే సోవియటుపై యుద్ధానికి కుట్రలుపన్ను తుంటే సోవియటు యూనియన్ భారతదేశంమీదికి దాడి చేస్తుందని పట్టాభిగారు చెప్పడం వాస్తవానికి విరుద్ధం. భారత ప్రజలకు నిజానిజా లను చెప్పకుండా మోసపుచ్చడం అవుతుంది. సామ్రాజ్యవాదుల యుద్ధ కుట్రలకు మన ప్రజలను గురిచేయడం అవుతుంది.

## యుద్ధానికి తయారయ్యేది ఎవరు ?

పట్టాభిగారి ప్రకటన చూస్తే రష్యా ప్రపంచాన్నంతా ఆక్రమించ బోతోందని అనిపిస్తుంది. కాని వాస్తవిక విషయాలు చూస్తే రష్యా యుద్ధానికి వ్యతిరేకంగా పోరాడుతోంది. బ్రిటిషు, అమెరికా సామ్రాజ్య వాదుల దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడుతోంది. ప్రతి విషయం లోను పీడితప్రజల వెనుక నిలబడుతోంది. అట్టి సోషలిస్టు రష్యాపై పట్టాభిగారు దురాక్రమణ నేరం మోపడం, రష్యా భారతదేశంపై దాడి చేస్తే భారత కమ్యూనిస్టులు ఏంచేస్తారని ప్రశ్నించడం, ఆవును చూపించి పెద్దపులి అని చెప్పి దానిని చంపుతావా, చంపవా అని అడిగినట్లుంటుంది.

బ్రిటిషు అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాక్రమణ ప్లానులను చూస్తే పట్టాభిగారి ప్రకటన వట్టి బూటకమని తేలుతుంది. ముందుగా అమెరికా సామ్రాజ్యవాదుల కుట్రలు చూద్దాం.

ఈ రోజున అమెరికాసేనలు ప్రపంచంలో 33 దేశాలలో స్థావరం ఏర్పరచుకుని ఉన్నాయి. జపాను, జర్మనీ లాంటి శత్రుదేశాలలో మాత్రమే వాళ్ళ సేనలుంటే, పోనీ అభివృద్ధి నిరోధకులను తుడిచిపెట్ట డానికి ఉన్నారనుకోవచ్చు (జపాను, జర్మనీలలో కూడా అభివృద్ధి నిరో ధకులనే వీరు బలపరుస్తున్నారు). కాని అమెరికా సేనలు వుంది శత్రు దేశాలలో కాదు పసిఫిక్ మహాసముద్రంలో నున్న అనేక దీవులలో మిలిటరీ కేంద్రాలు ఏర్పరుచుకున్నారు. ఫిలిప్పైను దీవులలో తమ సైన్యాలను పెట్టి అచ్చటి ప్రజా ఉద్యమాలను అణచివేస్తూ తమ గులా ములను అధికారంలోకి వచ్చేటట్లు చేస్తున్నారు. ఈ నాడు అమెరికా సరి హద్దుల బయట 7,000 మైళ్ళదూరం వరకూ అమెరికా మిలిటరీ స్థావ రాలు ఏర్పరుచుకుంది. ఈ స్థావరాలన్నీ సోవియటు యూనియన్‌కు చుట్టూ ఉన్నట్టివే నని గ్రహించాలి. ఈ విధంగా సోవియటుపై దాడికి సిద్ధమవుతుంది. కొన్ని ఉదాహరణలు తీసుకుంటే అమెరికా కుట్రలు ఇంకా స్పష్టంగా బయటపడుతాయి.

ముందుగా ఐస్‌ల్యాండు తీసుకుందాం. ఈ దీవి అమెరికాకు 3 వేల మైళ్ళు దూరంలో వుంది ఇచ్చట అమెరికా తన మిలిటరీ స్థావ రాలను బలపర్చుకుంటోంది. ఇచ్చట అమెరికా సేనలు అసలు ఎందు కుండాలి? ఇక్కడ నాజీలు ఎవరూలేరే తుడిచి వేయడానికి. అసలు కారణం ఒకటే. ఐస్‌లాండును శాశ్వతంగా తనచేతుల్లో పెట్టుకుని అక్కడ ప్రజలను దోచుకోడానికి అమెరికాప్రయత్నించుతోంది. మరొక ప్రధాన కారణం ఏమంటే ఐస్‌లాండు రష్యాకు 15 వందల మైళ్ల దూరంలోవుంది. అందుచేత రష్యాపైదాడిచేయడానికికూడా అనుకూలంగా ఉంటుందని ఆశించుతోంది.

ఇంకొక ఉదాహరణ తీసుకొందాం. సాదీ అరేబియా అమెరికాకు 7 వేల మైళ్ళ దూరంలోవుంది. సోవియట్‌యూనియన్‌కువెయ్యిమైళ్ళలో మాత్రమేవుంది. ఇచ్చట అమెరికా విపరీత ధనాన్ని వెచ్చించి (2 కోట్ల రూపాయిలు) విమాన కేంద్రాన్ని నిర్మించుతోంది. ఏ దేశ ప్రజల స్వాతంత్ర్యంకోసం విమానకేంద్రాన్నిఅమెరికా నిర్మించుతుందండీ పట్టాభి గారూ? ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యంకాదు అమెరికా సామ్రాజ్యవాదుల లక్ష్యం. వాళ్ళలక్ష్యం ప్రపంచాధిపత్యం సోవియట్‌యూనియన్‌పై యుద్ధం

చేయడానికి తగిన స్థావరాలు ఏర్పంచుకోవడం. పట్టాభిగారు ఈ రహస్యా లను మన ప్రజలకు చెప్పడంలేదు. సామ్రాజ్యవాద ఏజంటు రాయిటర్ చేసేప్రచారాన్నే పట్టాభిగారుకూడా చేస్తున్నారు.

ఇక బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వ్యవహారం చూద్దాం. వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలోకి కాంగ్రెసు నాయకులు వెళ్ళేసరికి అంతా స్వతంత్ర్యం వచ్చినట్లు పట్టాభిగారు మాట్లాడుచున్నారు. బ్రిటిష్‌సేనలు వెళ్ళిపోతాయట. మన దేశాన్ని మనమే రష్యాబారినుండి రక్షించుకో వాలని హెచ్చరించారు. పట్టాభిగారూ! ఇదీ ప్రజలను పచ్చిమోసానికి గురి చేయడం. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఇంత హృదయ పరివర్తనం వచ్చిందా? బ్రిటిషు సామ్రాజ్యవాదానికి హృదయ పరివర్తనమే వస్తే 24 దేశాలలో తమ సేనలను ఎందుకట్టి పెట్టింది? ఇండొనేషియా రిపబ్లిక్కును అణచడానికి భారత సేనలను ఎందుకు పంపింది? బర్మాకు భారతసేనలను ఎందుకు పంపింది? గ్రీసులో ఫాసిస్టులను బలపరుస్తూ అచ్చట ప్రజా ఉద్యమాలను ఎందుకు అణచివేస్తోంది? యుద్ధకాలంలో కంటే ఇప్పుడు భారత దేశంలో సేనలను ఎందుకు పెంచుతోంది? భారత సంస్థానాధీశ్వరులతో కుట్రలు పన్ని అచ్చట విమాన, నావికా మిలటరీ కేంద్రాలను ఎందుకు ఏర్పాటు చేస్తోంది? పట్టాభిగారూ వీటన్నిటికీ మీ సమాధానం ఏమిటి? బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఈ కుట్రలన్నీ మీరు ఎందుకు బయటపెట్టరు? పైగా బ్రిటన్ మనకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి సిద్ధంగా వుందని, మనకు ప్రమాదం రష్యా మాత్రమేనని మన ప్రజలను మోసపుచ్చుతారెందుకు? సామ్రాజ్యవాదం దానంతటదే పోదు. స్వాతంత్ర్యంకోసం మనం పోరా డాలి. సామ్రాజ్యవాదులను తరిమికొట్టాలి. అప్పుడే మనం స్వాతంత్రం సాధింపగలుగుతాం.

ఇక బ్రిటిషు కుట్రలను మనం స్పష్టంగా తెలుసుకుందాం. ఈనాడు భారతసేనలు ఈక్రింది దేశాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఉంచారు.

| | | |
|---|---|---|
| బర్మాలో | 10 | వేల సైనికులు |
| హాంకాంగులో | 10 | ,, |
| ఇండొనేషియాలో | 10 | ,, |
| ఇరాన్‌లో | 10 | ,, |

ఈ ప్రదేశాలలోనే కాక ఇంకా మలయాలోను, సయామ్‌లోను, ఫ్రెంచి ఇండోచైనాలోను, అండమాన్సులోను, మధ్యప్రాచ్యంలోను ఉన్నాయి. ఈ సైన్యాల నన్నింటినీ తాత్కాలిక ప్రభుత్వం ఎప్పుడు భారతదేశానికి రప్పించుతుంది ? ఆయా దేశాల స్వతంత్ర్యోద్యమాలను అణచడానికి బ్రిటిషు ప్రభుత్వం భారతసేనలను ఉపయోగించుతోంది. ఈ సేనలను వెనక్కు రప్పించడంలో ఒక్క రోజు ఆలస్యం చేయడం అంటే ఆయాదేశాల స్వాతంత్రాన్ని కూడా వాయిదావేయడం అవుతుంది. తాత్కాలిక ప్రభుత్వం ఎంత త్వరగా ఆసేనలను రప్పించుతుందో అంత త్వరగా ఆదేశాలు స్వాతంత్ర్యాన్ని పొందుతాయి.

ఇక మన దేశంలో బ్రిటిషు కుట్రలు విపరీతంగా సాగుతున్నాయి. సంస్థానాల్లో విపరీతంగా మిలటరీ కేంద్రాలు నిర్మించుతున్నారు. యుద్ధ సమయంకంటే ఇప్పుడు బ్రిటిష్ సేనలను ఇచ్చట పెంచారని రూఢిగా తెలుస్తోంది. స్వతంత్రంకోరే మనం ఈబ్రిటిషు సైన్యాలు బయటకు పోవాలని ఆందోళన చేయాలి. బ్రిటిష్ సైన్యాలు ఇచ్చట ఉన్నంతవరకు మనకు స్వతంత్రంరాదు.

ఒకప్రక్క బ్రిటిషు ప్రభుత్వం తమ సేనలను ఇచ్చట బలపర్చుకోడానికి ప్లానులు వేయిస్తోంది. కాని పట్టాభిగారు బ్రిటిషుసేనలు వెళ్ళిపోయినట్లే మాట్లాడుతున్నారు. రక్షణశాఖామంత్రి బలదేవ్‌సింగు రేడియో ఉపన్యాసంచూస్తే బ్రిటిషుసేనలు ఇంకా ఇచ్చట వుండాలంటున్నాడు. బ్రిటిషువాళ్ళు భారతసేనకు చేసిన సహాయాన్ని కొనియాడాడు. వారి నేర్పరితనాన్ని కొనియాడాడు. బ్రిటిషుసైన్యాలను బయటకుపంపే ధోరణి ఏమాత్రం కనపడటంలేదు బలదేవ్‌సింగు వుపన్యాసంలో. పైగా వారి నేర్పరితనాన్ని కొనియాడుతున్నాడు. నిజమే, బ్రిటిష్ సైనికులు నేర్పరితనం చూపించారు. జలియన్‌వాలాబాగ్‌లో మన ప్రజలను చంపి బ్రిటిషు సేనలు నేర్పరితనం చూపించాయి. భారత నావికులకు సానుభూతి చూపించిన 280 మంది బొంబాయి పౌరుల ప్రాణాలుతీసి నేర్పరితనం చూపించాయి భారతజాతీయ సైనికుల విడుదలకోసం ఆందోళనచేస్తున్న కలకత్తాపౌరులను చంపి నేర్పరితనం చూపించాయి. స్వతంత్రంకోసం పోరాడుతున్న కాశ్మీరు ప్రజలను రక్తంలో ముంచెత్తడంలో నేర్పరితనం చూపించాయి. బ్రిటిషు సామ్రాజ్యవాదుల దృష్టిలో ఇది నేర్పరితనము

చూస్తే అమెరికా, బ్రిటన్‌ల యొక్క సైనిక, నావిక, విమాన స్థావరాలు స్పష్టంగా తెలుస్తాయి ప్రపంచ మంతటా ఎలా వ్యాపించుతున్నారో కనబడుతుంది. వాళ్ళ దేశ సరిహద్దులు దాటి 8వేల మైళ్ళ దూరాన కూడా స్థావరాలు ఏర్పరుచుకున్నారు.

పట్టాభిగారు సోవియట్ కరాచీలో కాలు పెట్టబోతూంది అని చెప్పే మాటలు పచ్చి అబద్ధమని ఈ పటం చూస్తే తెలుస్తుంది. బెల్‌గ్రేడ్, ప్రేగు మొదలగు చోట్ల సోవియటు సైన్యాలున్నట్లు ఈ పటంలో చూపబడింది. కాని ఇవి మిలిటరీ స్థావరాలు కాదు. సోవియటు యూనియన్ ఆదేశాలతో పరస్పర సహాయక సంధులు చేసుకుంది పైగా ఈ దేశాలన్నీ సోవియటుకు 400 మైళ్ళ దూరంలోవున్నాయి.



కావచ్చు. కాని కాంగ్రెసు ఏర్పరచిన తాత్కాలిక ప్రభుత్వ సభ్యుడు బ్రిటిషుసేనల నేర్పరితనాన్ని మెచ్చుకుంటున్నాడంటే మనం సిగ్గుపడాలి. దీనిని సామ్రాజ్యవాదులు హర్షించుతారు. బ్రిటిష్‌వాళ్ళకు హృదయపరివర్తనము వచ్చిందని, బ్రిటిషుసేనలు వెళ్ళిపోతున్నాయని పట్టాభిగారు గుండె మీద చేయివేసుకుని చెప్పగలరా ?

మన దేశంలో బ్రిటిష్‌వాళ్ళ కుట్రలు చూచాం. ఇక విదేశాలలో వీళ్ళ కుట్రలు చూడండి.

గ్రీసుదేశ ప్రజలు మూడేళ్ళపాటు హిట్లరుకు వ్యతిరేకంగా పోరాడారు. చివరకు హిట్లరు సైన్యాలను బయటకు కొట్టారు. ప్రజాపక్షమైన ఇ. ఎ. యం. నాయకత్వం క్రింద నాజీ రాక్షసులను బయటకుకొట్టారు. కాని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ సైన్యాల నచ్చట ఉంచి రాజరిక ఫాసిస్టువాదులను సింహాసన మెక్కించి ప్రజాఉద్యమాన్ని రక్తంలో ముంచెత్తుతున్నాయి.కాని పట్టాభిగారికి మాత్రం ఇది కనబడదు.

పోనీ ఈజిప్టు తీసుకుందాం. అచ్చట విద్యార్థులు బ్రిటిష్ సేనలు పోవాలన్నందుకు తమదేశానికి స్వతంత్రంకావాలన్నందుకు విద్యార్థులపై బ్రిటిష్‌సేనలు తుపాకులతో కాల్చాయి. తమ సైన్యాలను ఇంకా ఎక్కువ చేశారు. ఈజిప్టుస్వతంత్రోద్యమాన్ని అణచివేస్తున్నారు. అచటప్రజాసంస్థల నన్నింటిని నిషేధించారు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు చేస్తున్న ఈ రాక్షస కృత్యాలను ఇంకెన్నింటినైనా ఇవ్వవచ్చును. కాని పట్టాభిగారుమాత్రం ఇవన్ని మనకు చెప్పరు. ఆయనకు కనపడేదల్లా ఒక్క సోవియటు రష్యా. ఆయనదృష్టిలో రష్యాయే దురాక్రమణకు తయారవుతోంది. బ్రిటను అమెరికాలు దురాక్రమణకు ఎలా సిద్ధమవుతున్నాయో పైన చూపించాను. ఇక సోవియటు యూనియన్ ఎల్లప్పుడూ ప్రపంచ పీడితప్రజల వెనుక ఎలా నిలిబడుతూవుందో చూద్దాం.

## సోవియటు మన మిత్రరాజ్యం

"రష్యా" బెస్సరేబియా, బుకొవినాలను తన పొట్టను పెట్టుకొన్నది. డార్డినెల్సు జలసంధిపై తన దృష్టి ప్రసరిస్తున్నది. ఉత్తరాఫ్రికా తీరాన మెడిటరేనియన్ ఆశ్రయం సంపాదించాలని పడరాని పాట్లు పడుచున్నది. రష్యా పర్షియన్ సింధుశాఖలో ఒక కాలుమోపి రెండో

కాలును కరాచిలో పెట్టడానికి జాపుతున్నది" ఇదీ పట్టాభిగారు రష్యాపై ఇచ్చిన అభిప్రాయం. కాని నెహ్రూగారు తాత్కాలిక ప్రభుత్వంలో ప్రవేశంచిన తర్వాత ప్రభుత్వ విదేశాంగపాలసీని విశదీకరించుతూ, రష్యాను అభినందించారు. రష్యాతో స్నేహసంబంధములు పెట్టుకుంటామని అన్నారు. విదేశాంగశాఖకు ఆధ్వర్యం వహిస్తున్న నెహ్రూ పండితుడు సోవియటుతో స్నేహం ఏర్పరుచుకుంటామని చెబుతోంటే పట్టాభిగారికి ఈ దాడి సమాచారం ఎక్కడినుంచి వచ్చిందో వారికే తెలియాలి.

ఇక పట్టాభిగారు రష్యాపై మోపిన నేరాలను ఒక్కొక్కదానినే చూదాం. బెస్సరేబియా, బుకోవినాలను రష్యా పొట్ట పెట్టుకుందంటున్నారు పట్టాభిగారు. అసలు ఈ బెస్సరేబియా, బుకోవినాలు ఎవరికి సంబంధించినవో మనం తెలుసుకోవాలి. బెస్సరేబియా, బుకోవినాలు సోవియటులోని యుక్రెయిన్ దేశానికి సంబంధించిన ప్రదేశాలు. మొదటి ప్రపంచయుద్ధం పూర్తికాకముందే రష్యాలో విప్లవంవచ్చి సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడింది. అప్పుడు సామ్రాజ్యవాదులు ఓర్వలేక 21 దేశాలు కలసి సోవియటుపై దాడిచేశారు. ఈ సామ్రాజ్యవాదుల దాడిని సోవియటు ప్రజలు 'ఎదుర్కొని రక్షించుకోగల్గారు. కాని, సోవియటు గడ్డకు సంబంధించిన బెస్సరేబియా, బుకోవినాలాంటి ప్రదేశాలను సామ్రాజ్యవాదులు ఇతర దేశాలతో కలిపివేశారు. ఇప్పుడు రెండవ యుద్ధానంతరం సోవియటు యూనియన్ తన దేశానికి సంబంధించిన ముక్కలను చెరనుండి విడిపించి అచ్చట ప్రజలను తమ సోదర ప్రజతో కలిపింది. అసలు విషయం ఇదైతే పట్టాభిగారు రష్యా వీటిని పొట్ట పెట్టుకుందని సామ్రాజ్యవాదులు చేసే ప్రచారాన్ని చేస్తున్నారు. ఉదాహరణకు మన రాష్ట్రంలో ఒక సమస్యను చూద్దాం. సామ్రాజ్యవాదులు మన తెలుగుగడ్డను ముక్కలుచేసి నైజాం క్రింద ఒక కోటిమంది తెలుగు ప్రజలను పెట్టింది. మన తెలుగు ప్రజలు అచ్చట నానా బాధలు పడుతున్నారు. మనం నైజాం క్రింద నున్న తెలంగాణా జిల్లాలను ఆంధ్రలో కల్పాలని, అది మన హక్కనీ పోరాడుతున్నాం. నైజాం ప్రభుత్వాన్ని కూలద్రోసినపుడు ఆ జిల్లాలను మన ఆంధ్రదేశంతో కలుపుకుని 3 కోట్ల ఆంధ్ర ప్రజలను ఐక్యపర్చాలని

ఉవ్విళ్ళూరుచున్నాం. అలాగే సోవియటు యూనియన్ తన దేశానికి సంబంధించిన ప్రదేశాలను తిరిగి కలుపుకుంది. అటువంటప్పుడు వాటిని రష్యా పొట్ట పెట్టుకుందని పట్టాభిగారు విలపించవలసిన అవుసరం ఏముంది? చరిత్ర తెలిసిన ప్రతివ్యక్తికీ ఈ విషయాలు తెలుసు. కాబట్టి పట్టాభిగారూ! మీరు సామ్రాజ్యవాదుల ప్రచారాన్నే భుజాన వేసుకొని మోయడం వలన మన ప్రజలను తప్పుడు మార్గాల్లో పెట్టిన వారవుతారు. కాంగ్రెసు చరిత్ర వ్రాసిన వీరు చరిత్రకే ఇలా వక్రభాష్యం చెప్పడంలోని అర్థం ప్రజలు గ్రహించాలి.

ఇక డార్డినెల్సు జలసంధికి వద్దాం. డార్డినెల్సుజలసంధి సోవియటు రేవుపట్టణమైన ఒడెస్సాకు 500 మైళ్లదూరంలో వుంది. ఈ రోజున బ్రిటిష్, అమెరికన్ సేనలు డార్డినెల్సులో వున్నాయి. డార్డినెల్సును ఆశ్రయంగా చేసుకుని సోవియటుపై ఉరకవచ్చని బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్లానులు వేస్తున్నారు. అటువంటప్పుడు సోవియటు రష్యా తన దేశాన్ని సామ్రాజ్యవాదుల బారినుండి తన్ను తాను రక్షించుకోవాలంటే డార్డినెల్సు జలసంధిలో సోవియటుకూడా హక్కు ఉండటం న్యాయమేగదా! కనీసం వ్యాపార ఓడల రవాణా జరగాలంటే ఈహక్కు రష్యాకు కావాలి. ఈహక్కు అడిగినందుకు అమెరికన్, బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు పెద్దగోల మొదలుపెట్టారు. అబ్బో! సోవియటు, మెడిటరేనియన్ అంతా ఆక్రమించుకోడానికి ప్లాను వేస్తోందని తమ పత్రికలద్వారా తమ ఏజంటు రాయిటరుద్వారా బాకాలూదడం మొదలుపెట్టారు. ఇంకేం! పట్టాభిగారుకూడా ఇక్కడ సామ్రాజ్యవాదుల కొమ్మేసుకున్నారు. రష్యాపైన లేనిపోని నేరాలను వేయడం మొదలు పెట్టారు. ప్రపంచాధిపత్యం కోసం వేలకువేలు మైళ్ళదూరంగా బ్రిటన్, అమెరిన్ సామ్రాజ్యవాదులు నిర్మించిన, నిర్మించుతున్న, విమాన, నావికా, మిలిటరీ కేంద్రాలను కప్పిపుచ్చుకోవడంకోసం సోవియటుపై ఈ దుష్ప్రచారానికి దిగారు.

బ్రిటిష్, అమెరికా సేనలు ఎక్కడెక్కడ ఎన్ని దేశాలలో వున్నవో ఇదివరకు చెప్పాను. (పుస్తకం చివర పట్టికలోకూడా చూపబడ్డాయి.) సామ్రాజ్యవాదులు చేసే దుష్ప్రచారాన్ని తెలుసుకోవాలంటే సోవియటును గురించి మనం మరికొన్ని విషయాలు తెలుసుకోవాలి. ఈ రోజున సోవియటు ఎర్రసైన్యం సోవియటు సరిహద్దును దాటిన

తర్వాత 450 మైళ్ళు మించి ఒక్కసైనికుడుకూడా లేడు. సోవియటు సరిహద్దుకు బయటనున్న సైన్యంకూడా సోవియటుకు శత్రుదేశాలుగా యుద్ధంచేసిన విదేశాలలోనే వున్నాయి. అచ్చటనున్న అభివృద్ధినిరోధకులను, ఫాసిస్టులను తుడిచిపెడుతున్నాయి. సామ్రాజ్యవాదులు తమపై పన్నే కుట్రలను విచ్ఛిన్నం చేయడానికి, సోవియటును శత్రుదాడినుంచి రక్షించుకోడానికి మాత్రమే వున్నాయి. సోవియటు సైన్యాలు సోవియట్‌కు ప్రక్కనే వున్న పోలెండు. ఫిన్లండు. హంగరీ, బల్గేరియా, ఆస్ట్రియా, తూర్పు జర్మనీ, రుమేనియాలలో మాత్రమే ఉన్నాయి. బ్రిటిష్, అమెరికన్ సైన్యాలలాగా ప్రజా ఉద్యమాలను అణచివేయడం కాక, ఈ దేశాలన్నింటిలోను నూతన ప్రజాస్వామిక ప్రభుత్వాలు ఏర్పడటానికి సహాయం చేస్తున్నాయి. అచ్చట ప్రజాప్రభుత్వాలకు సహాయం చేస్తున్నాయి. అచ్చటి ప్రజలు సోవియటు సైన్యాన్ని తమను నాజీల బారినుండి రక్షించిన విముక్తిసైన్యంగా చూస్తున్నారు. ఆయా దేశాలలోని అభివృద్ధినిరోధకులను తుదముట్టించడానికి సహాయపడుతున్నారు. ఈ రోజున సోవియటుసేనలున్న తూర్పు యూరపు దేశాలలో నున్న ప్రజాస్వామికాన్ని చూస్తే సోవియటుసైన్యాలు ఆయా దేశాలలో ప్రజా ప్రభుత్వాలు ఏర్పరుచుకోడానికి ఎలా తోడ్పడుతున్నాయో తెలుస్తుంది. ఆ దేశాలన్నింటిలోను జమీందారీ విధానాన్ని రద్దుచేసి కష్టించే రైతులందరికీ భూమినిచ్చారు. పరిశ్రమ లన్నింటినీ జాతిపరం చేసి ప్రజల జీవిత పరిమాణాన్ని అభివృద్ధిచేస్తున్నారు. కాని, బ్రిటిష్ అమెరికన్ సైన్యాలు వున్నచోట్లల్లా అంతర్యుద్ధాలను రెచ్చగొడుతున్నారు. ఇదివరకు ఫాసిస్టులకు తొత్తులుగా నున్నవారిని సింహాసన మెక్కించి ప్రజలను నానా బాధలు పెడుతున్నారు. ఆ ప్రజలను దోచుకొంటున్నారు. కాని పట్టాభిగారికి సామ్రాజ్యవాదులదురాక్రమణకుట్రలు కనబడటంలేదు. సోవియటుపై మాత్రం నేరాలు ఆరోపిస్తున్నారు.

ఎర్ర సైనికులు సోవియటు సరిహద్దు దాటి 450 మైళ్ళ తర్వాత ఒక్కడూ కూడా లేనప్పుడు (ఇదివరకు శత్రుదేశాలుగా ఉన్న వాటిలోనే సోవియటు సైన్యాలున్నాయి) బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాద సైన్యాలు తమ దేశాలనుండి వేలకువేల మైళ్ళ దూరాన మిలిటరీ స్థావరాలు ఏర్పరచుతున్నపుడు. పట్టాభిగారి కళ్ళకు సోవియటు యూనియన్

దురాక్రమణకు దిగుతున్నట్లు కనబడుతోంది. ఇంతకన్నా వైపరీత్యం ఏముంటుంది ?

పోని, మిత్రరాజ్యసమితిలో సోవియటు పాత్ర చూడండి. బ్రిటిష్ అమెరికన్ సామ్రాజ్యవాదుల పాత్ర చూడండి. మిత్రరాజ్య సమితిలో సోవియటు యూనియన్ ఎప్పుడూ పీడిత ప్రజల వెనుక నిలబడుతుంది. బ్రిటను అమెరికన్ సామ్రాజ్యవాదులు ఎప్పుడూ ప్రతిదేశంలోని అభివృద్ధి నిరోధకులను బలపర్చటమే ఆశయంగా పెట్టుకున్నారు

## మిత్రరాజ్య సమితిలో

— భారతదేశానికి స్వతంత్రం ఇవ్వాలని బల్లగుద్ది చెప్పిందెవరు ? సోవియట్ యూనియన్.

— ఇండొనేషియా నుండి బ్రిటిషు సేనలను వెనక్కు రప్పించాలని చెప్పిందెవరు ? సోవియటు యూనియన్.

— గ్రీసు నుంచి బ్రిటిషు సేనలను బయటకు రప్పించమన్నది ఎవరు ? సోవియటు యూనియన్.

పీడిత ప్రజలకు అండగా సోవియటు నిలచిన ఇటువంటి ఉదాహరణలను ఎన్నైనా ఇవ్వవచ్చు. అటువంటి సోవియటుతో స్నేహసంబంధాలు ఎక్కువ చేసుకోవలసిన పరిస్థితుల్లో పట్టాభిగారు సోవియటుపై లేనిపోని దురాక్రమణ నేరం మోపి మన శత్రుదేశంగా చిత్రిస్తున్నారు.

## మోసపోవద్దు

ఈపుస్తకంచివర ఎవరి సైన్యాలు ఎక్కడెక్కడున్నాయో పట్టికలలోను, 8వ పేజీ పటంలోనుకూడా చూపించబడినాయి. మూడవప్రపంచ యుద్ధానికి ఎవరు తయారవుతున్నారో తెలుసుకోండి. సోవియటు యూనియన్‌ను చుట్టుముట్టి దాడిచేయడానికి సిద్ధంగావుంది, ఎవరోచూడండి. బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ దురాక్రమణ కుట్రలను దాచడానికి సోవియటుపై వేసే నిందలను తెలుసుకోండి. పట్టాభిగారి ప్రకటనలోని బూటకత్వాన్ని తెలుసుకోండి. ఇవన్నీ మనం తెలుసుకున్నపుడు సామ్రాజ్యవాదుల మోసాన్ని గ్రహించగల్గుతాం. సామ్రాజ్యవాదుల నీచ ప్రచారానికి మన ప్రజలు లోనుగాకుండా కాపాడగల్గుతాం.

సామ్రాజ్యవాదులు మూడవ ప్రపంచ యుద్ధానికి వేస్తున్న కుట్రలకు వ్యతిరేకంగా మనం అంతా లేవాలి. ప్రపంచం మరొకసారి యుద్ధజ్వాలలకు గురికాకుండా చూడాలి. సామ్రాజ్యవాదుల లాభంకోసం మన ప్రజలు, మనదేశం ఉపయోగపడకుండా చూడాలి. మనలాగానే స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న ప్రపంచ ప్రజల వెనుక నిలబడాలి. ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యోద్యమానికి అండగానిలుస్తున్న సోవియటుతో స్నేహసంబంధాలు పెంపొందించుకోవాలి. సామ్రాజ్యవాదుల ప్రణాళికకు వ్యతిరేకంగా అంతిమ పోరాటం సాగించాలి. ఇదే నేడు స్వతంత్రానికి రాచబాట.

ఈదిగువ ప్రదేశాలలో అమెరికా, బ్రిటన్‌లయొక్క సేనలున్నాయి. ఈ సామ్రాజ్యవాదులు తమదేశ సరిహద్దులకు బయట 7 వేల మైళ్ళవరకు వ్యాపించారు.

## అ మె రి కా

1. పెనామా కాలువ
2. జమైకా
3. గ్వాన్టనామో
4. ప్యూర్టొరికొ
5. బెర్మ్యూడ
6. నోవాస్కోషియా
7. పెర్నాంబుకొ
8. న్యూఫౌండులాండు
9. డాకర్
10. లైబీరియా
11. అజోర్సు
12. సాదీఅరేబియా
13. ఐస్‌లాండు
14. గ్రీన్‌లాండు
15. గాలాపెగోస్
16. క్రిష్టమస్ దీవులు
17. సమోవా
18. మిడ్వే
19. అట్టు దీవులు
20. ఫిజీ దీవులు
21. మార్షల్ దీవులు
22. వేక్
23. న్యూకేలిడోలియా
24. సోలమన్సు
25. గ్వామ్
26. ఒకినావా
27. మనిలా
28. జపాను
29. పశ్చిమ జర్మనీ
30. చైనా
31. కొరియా
32. ఆస్ట్రియా

## ఇంగ్లండు

1. జీబ్రాల్టరు
2. నైగేరియా
3. సుడాన్
4. రొడేషియా
5. టాంగనీకా
6. ఈజిప్టు
7. బ్రిటిష్ సోమలీల్యాండు
8. కెన్యా
9. పాలెస్టయిన్
10. ఇరాన్
11. సాదీ అరేబియా
12. ట్రాన్సుజోర్డాన్
13. బర్మా
14. ఇండియా
15. కొలంబో
16. సింగపూరు
17. హాంకాంగు
18. సరావా
19. న్యూగినియా
20. ఇరాన్
21. ఇండొనేషియా
22. ఆస్ట్రియా
23. పశ్చిమ జర్మనీ
24. గ్రీసు
25. సయామ్
26. ఫ్రెంచి ఇండోచైనా
27. అండమాను దీవులు

ఈ దిగువ దేశాలలో సోవియటు సేనలున్నాయి. ఈ సేనలన్నీ యుద్ధంలో సోవియటుకు శత్రుదేశాలుగా ఉన్న దేశాలలో ఉన్నాయి. సోవియటు సరిహద్దు అవతల 450 మైళ్ళలో మాత్రమే ఉన్నాయి. ఇవన్నీ సోవియటు సరిహద్దున ఉన్నదేశాలు.

1. పోలెండు
2. ఫిన్లెండు
3. ఆస్ట్రియా
4. హంగరీ
5. బల్గేరియా
6. రుమేనియా



ప్రజాశక్తి ప్రెస్ బెజవాడ. నెం 3/13 సి కాపీలు 5,000 22-11-46.

## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B110 |
| పుస్తకం పేరు | మద్రాసు మంత్రివర్గమా ఎక్కడికి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |